

Chandamama, May '51 Photo by T. Suryanarayan

ఔరా!

## చందమామ
## చందాదారులకు మనవి

చందమామ ప్రతినెల, గతనెలాఖరులోనే చందాదారులకు పోస్టు చేయబడును. కాపీ చేరనిఎడల మొదటి ఆరు తారీఖులలోగా తమ పోస్టాపీసులో విచారించి, మాకు తెలియ జేయాలి. 10 వ తారీఖు తరువాత వచ్చు కంప్లైంట్లు ఆమోదింపబడవు. గడచిన మాసములలో చేరలేదనే కంప్లైంట్లు గమనింపబడవు.

త్వరలో

ఆనాడు నేస్తోడుగా పెండ్లియాడి
ఈనాడు, తెగనాడి, నే పాలుచేయ
తాళిగట్టినవాడు తలపెట్టినాడు
ఈ పరాభవము నీదే అగ్నిదేవుడా.



# స్త్రీ సాహసము

దర్శకత్వము
వేదాంతం రాఘవయ్య

రచన, పర్యవేక్షణ......సముద్రాల ** సంగీతం......సుబ్బరామన్



ఛాయాగ్రాహణం......రంగా • • కళ......వాలి & గొడగాంకర్...

ఆంధ్ర, సీడెడ్, నైజాం : పూర్ణా రిలీజు | మైసూర్ : అమృత పిక్చర్స్














ప్రొడ్యూసర్, డైరెక్టర్ : ప్రకాశరావు
రచన : తాపి
కెమేర ... రంగ
మ్యూజిక్ ... పెండ్యాల
ఆర్టు ... శర్మ ...

SHARMA.T.V.S

అతి త్వరలో!



టి.యస్.టి.వారి

# నవ్వితే నవరత్నాలు

కృష్ణకుమారి .... రామశర్మ ... సులోచనాదేవి
నిర్మలాదేవి... అడ్డాల... సీత... వంగర... లలిత... పద్మిని
వెంకటేశ్వరరావు... భూదేవి

డైరెక్టర్.....యస్.సౌందరరాజన్





సంపుటి 8
సంచిక 5

మే
1951

# చందమామ

సంచాలకుడు : చక్రపాణి

---

వేసంగిసెలవలంటే పిల్లలకు చెప్పలేనిసంతోషం. ఎందుకని? 'మావాడు ఏడాదల్లా కష్టపడి చదివాడమ్మా' అని చెప్పి ఆ అలసట తగ్గటానికి తగిన సదుపాయాలు ఎన్నో చేస్తారు తలిదండ్రులు. మళ్లీ కొత్త తరగతిలో ప్రవేశించి బాగా చదవటానికి తగ్గ బలమూ, ఉత్సాహమూ చేకూరుస్తారు. విద్యార్థులకే గాక, కొంతమంది ఉద్యోగస్థులకూ, రైతులకూకూడా వేసవి విశ్రాంతిసిచ్చే కాలం. దీనినే గ్రీష్మ ఋతువంటారు. ఒకవంక మండుటెండలు మాడుస్తూవుండగా మామిళ్లుమటుకు ఇప్పుడు ముమ్మరంగా వస్తాయి. మామిళ్లు అనేసరికి ఒక ముఖ్యవిషయం జ్ఞాపకానికి వస్తుంది. వైశాఖంప్రవేశిస్తే కాని మామిడిపళ్లు తాకకూడదనే నియమం ఒకటున్నది. మామిడిలో జీవపోషక పదార్థాలన్ని కూడుకొని సరిఐన పక్వానికి ఈ ఋతువులోనే వస్తుందని శాస్త్రజ్ఞులు చెబుతారు. అందుకనే మనవాళ్లు తొలిఫలాలను పెద్దలకు ఇచ్చి సత్కరించిన తరువాతనే తాము ఆరగిస్తారు. ఈ ఫలాలతోపాటు తాటాకు విసనకర్రలూ, తీయనిపానకమూ కూడా పంచిపెట్టుతారు. ఇదే మనకు; 'వైశాఖపూజ' అనే పేరుతో ఒక మతాచారంగా యేర్పడివున్నది.








# చేసినవారికి చేసినంత

ప్రభువరేణ్యుల దివాణంలో
మదపుటేనుగ ఉన్నదొక్కటి.
తీసుకెళ్తున్నాడు దానిని
ఏటిదరి కొకరోజు మావటి.

ఇంతలోనే వీన్గమెడపై
హాయిగా కూర్చున్న మావటి
కేసి విసిరారెవ్వరో మరి
పెద్ద కొబ్బరికాయ ఒక్కటి.

చేత దానిని చక్కపట్టుక
పగులగొట్టడమెలాగా అని
చేయసాగా డతడు యోచన
రాయి ఎక్కడ దొరకనందున.

చివరికాతడు విసిగి కొబ్బరి
కాయ ఏనుగ శిరముమీదను
పగులగొట్టాడించుకైనా
తలపలేదా జీవి బాధను.

జ్ఞాపకం ఏనుగులకెక్కువ
తెలివి వాటికి కాదు తక్కువ.
వెంటనే కనిపెట్టగల వవి
వానిపై మనకున్న మక్కువ.

రచన :
బైరాగి

మనసులోనే తలచుకొని ఆ
ఏనుగప్పుడు ఊరుకొన్నది.
కాని మావటిపైన కోపం
దానిమనసున పేరుకొన్నది.

ఒక్కవారం గడచిపోగా
మరల ఏనుగ వీధివెంబడి
పోవుచున్నది దాని వీపున
కూరుచుని ఉన్నాడు మావటి.

ఇంతలో కనపడిం దేనుగ
కొక్క కొబ్బరికాయఁ అంగడి.
'ఒహో సరి' అని ఏన్గు తొండం
చాచి కాయలు తీసి వడి వడి,

విసరి కొట్టిందలా మావటి
మీద. వాడా దెబ్బతో తల
పగిలి 'హరి! హరి! హరీ!' అంటూ
నీల్గి చచ్చాడంతలోపల.

'ఎవడు చేసిన చేటు వాడికి
ఎప్పుడైనా తగలకుండా
ఉండ'దని అంటారు పెద్దలు.
పోదు పాపం పండకుండా.






మాళవదేశానికి ప్రభువు ఇంద్రద్యుమ్న మహారాజు. ఆయన మంచి హృదయం కలవాడు. ప్రజను కన్నబిడ్డలలా చూచుకునేవాడు. గాఢమైన విష్ణుభక్తుడు కావటం చేత ఆయనను 'పురుషోత్తము' డనికూడా పిలుస్తూవచ్చారు.

ఒకప్పుడు పురుషోత్తముడు దేశంలోగల దివ్యక్షేత్రాలన్నీ దర్శించుకురావాలి అనుకున్నాడు.

ఈ వుద్దేశంతో ఆయన తన రాజ్యాన్ని మంత్రులకు వప్పగించి, పురోహితుణ్ణి మాత్రం వెంటబెట్టుకొని, బయలుదేరాడు. అనేకమైన ప్రసిద్ధ క్షేత్రాలు దర్శించుకొంటూ పోయిపోయి కొన్నాళ్లకు ఒక చిత్రమైన ప్రదేశం చేరుకున్నాడు. అక్కడ ఎన్నో ఇళ్లున్నాయి. కాని, ఎవరూ నివాసమున్న అలికిడిలేదు. ఒక బ్రహ్మాండమైన మర్రిచెట్టున్నది. ఎటుచూచినా అది పది ఆమడ దూరం వ్యాపించివున్నది. ఒక చక్కటి దేవాలయం కనిపించింది. ఆ దేవాలయం తలుపులు తీసి చూచాడు. ఆ దేవుడెవరో కాని, పూజాపురస్కారాలు అందుకొంటున్న సందడి లేదు. ఇదేమిటా అని పరిశీలనగా చూచాడు. అసలు ఆ గుడిలో విగ్రహమే లేదు !! ఇది మరీ విడ్డూరమనిపించింది. ఈ గుడి యేమిటో, అందులో వుండే స్వామి ఎవరో, దీపం ధూపం లేకండా ఆలయం ఎందుకు పాడుబడివుందో ఈ సంశయాలన్నీ మనస్సుకి పట్టి, తల్లడిల్లిపోజొచ్చాడు. ఐతే, ఆ నిర్జన ప్రదేశంలో ఎవరిని అడగటం !

ఇలా వేగిపోతూ పిచ్చివానిలాగా కూర్చునివుండగా, గుడిపక్కనించి పోతున్న ఒక వృద్ధుడు అగపడ్డాడు. పురుషోత్తముడు ఆ వృద్ధుణ్ణి తనపాలిటి దేవునిగా ఎంచి, "మహానుభావా ! ఇదేవూరు ? ఇంత

'చిట్టిబాబు' పరశువాకం

నిర్మానుష్యంగా ఉన్నదేమిటి? ఈ గుడి యేమిటి, గుడిలో ఏ విగ్రహమూ లేకపోవడ మేమిటి?" అంటూ ఆత్రంతో ప్రశ్నించాడు.

అందుకు ఆ వృద్ధుడు "అబ్బాయీ! ఆ గొడవంతా చెబుతూ కూర్చోవటం నీకూ నాకూ పని చెరుపే. ఏమంటే ఈ సమస్యను ఆర్చేవాళ్లు కాని, తీర్చేవాళ్లుగాని ఇంత వరకూ నాకు కనిపించలేదు. కనుక, నీ దారిని నీవు వెళ్లు" అన్నాడు.

ఈ మాట వినగానే పురుషోత్తముడికి జిజ్ఞాస మరింత ఎక్కువై, ఏమైనా సరే చెబితేగాని వదిలేది లేదని పట్టు పట్టాడు. అప్పుడు వృద్ధుడు ఇలా చెప్పసాగాడు:

"ఓయి వత్సా!— నీ పట్టుదలకు మెచ్చాను. పైగా నీ ముఖలక్షణాలలో దైవాంశ ఉన్నట్టు గోచరిస్తున్నది. అందుకనే ఈ ప్రదేశాన్ని గురించిన చరిత్ర నీకు వెల్లడించదలిచాను, విను. ఈ ప్రదేశం చాలా మహిమ కలది. ఈ మర్రిచెట్టుకింద నివసించేవారికి పాపాలన్నీ తొలగిపోయి, సమస్త సుఖములతోనూ తులతూగుతూ వుంటారు. అదుగో ఆ కనుపిస్తూవున్న సరోవరంలో దేవతలు స్నానంచేసేవారట. ఎంతో మంది భక్తులకు కేవలమూ శ్రీ మహావిష్ణువే




అందులో ప్రసన్నమైనాడట. ఉత్తరదిశను అగపడేది కేశవాలయం. ఈ కేశవుణ్ణి దర్శిస్తే స్వర్గమే లభించేదట!

తలవని తలంపుగా ఈ క్షేత్రంలో ఒక రోజున విపరీతమైన సంఘటన జరిగింది. ఏమిటీ అంటే—మామూలుప్రకారం నేను గుడిలో కూర్చునివుండగా, మైకం కమ్మి, మేనువాల్చాను. ఒక స్వప్నం వచ్చింది. స్వప్నంలో నారదమహర్షి కనబడి ఒక సమాచారం చెప్పాడు:

'ఓయి సద్గురూ! ఇంతవరకూ మహిమలతో కూడుకొని ఉన్న ఈ ప్రదేశంలో గొప్ప మార్పు రాబోతున్నది. ఏమంటే—"ఫలానా



మఱ్రిచెట్టుకింద నివసించే ప్రజలందరకూ స్వర్గప్రాప్తి లభిస్తూవున్నదే, మరి వేరే నరక మెందుకు సృష్టించావయ్యా?' అని బ్రహ్మను ప్రశ్నించారట. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేక బ్రహ్మ సరాసరి విష్ణుమూర్తివద్దకు పోగా విష్ణువు 'సరే, ఉపాయం ఆలోచిస్తాలే' అని చెప్పిపంపాడు. నీవు భక్తుడవు గనుక ఈ రహస్యం వెల్లడించాను' అనేసి నారదుడు మాయమయ్యాడు.

వెంటనే ఊరివారికి నా స్వప్నకథ చెప్పాను. గుడిలోకి పోయి చూతుముకదా, కేశవుని విగ్రహం కానరాకపోయె!! నారద మహర్షి వచ్చి నాకు కలలో చెప్పిన హంశం ఇలా ప్రత్యక్షంగా రుజువైనందుకు అందరూ ఆశ్చర్యపోయారు.

అమరునాడు మళ్లీ నారదుడు నాకు కలలో సాక్షాత్కరించి,

'సద్గురూ! నీవు విచారించకు. మాధవుడు మళ్లీ వచ్చి గుడిలో ప్రవేశించా లంటే ఒకటే మార్గమున్నది. దేవుని యందు నిండు విశ్వాసమున్న ఎవరైనా తెల్లవారుజామున ఒంటిపాటుగా బయల్దేరి తూర్పుదిశగా చూస్తూ పోతూవుంటే ఈ సరోవరం ఒక బ్రహ్మాండమైన సముద్రంగా మారిపోతుంది. ఆకాశమంత ఎత్తున అలలు లేచి, భయంకరమైన శబ్దం చేస్తూ వుంటాయి. ఎంతమాత్రమూ చలించక ఆ అలలలోకి దూకాలి. మధ్యని ఒక గొప్ప రావిచెట్టు మునిగివున్నట్టు కనిపిస్తుంది. ఆ చెట్టుకొమ్మలు నరికివేస్తే అప్పుడు పరమేశ్వరుడు ప్రత్యక్షమై, కావలసిన కోరికలు నెరవేరుస్తాడు' అని చెప్పి అంతర్హితుడయా"డన్నాడు.

ఈ స్వప్నకథ విన్న పురుషోత్తమునికి మనసులో ఆరాటం మరీ ఎక్కువైంది. "తాతగారూ! ఇప్పుడే నేను బయల్దేరి వెళుతున్నాను. ఎన్ని కష్టాలకైనా ఓర్చి విచిత్ర

దైవమైన ఆ మాధవుణ్ణి ప్రసన్నం చేసుకుంటాను. ఆ స్వామి కటాక్షించి మళ్లీ ఆలయంలో ప్రవేశించేవరకూ నేను నిద్రాహారాలకోసం అపేక్షించను" అని తన నిశ్చయాన్ని వెల్లడించాడు.

ఇందుకు వృద్ధుడు "నాయనా! నీలాగే ఈ వూరిలో చాలామంది ఉబలాటపడి ప్రయత్నాలు చేశారు. కాని ఆ భయంకర దృశ్యాలకు తట్టుకోలేక మరలివచ్చేశారు. నేనే వెళదామని అనుకున్నాను. కాని వృద్ధాప్యంవల్ల పోలేకపోయాను. మరో విగ్రహమైనా ప్రతిష్ఠించుదామంటే ఎన్నిసార్లయినా ప్రతిష్ఠించిన విగ్రహం అదృశ్యమైపోతూనే వచ్చింది. కాని నిలవలేదు. కనుక 'ఈ ప్రదేశంలో ఉండటం ఇక క్షేమం కాదు' అని ఇళ్లూ వాకిళ్లూ విడిచి ప్రజలంతా మరొక చోటికి పోయారు. ఎన్నివిధాల వాళ్లకి నచ్చచెప్పినా లాభం లేకపోయింది. ఏనాటికైనా ఒక సమర్థుడు రాకపోతాడా, మళ్లీ మాధవుని రప్పించలేకపోతాడా అనే నమ్మకంతో, అటువంటి కుతూహలుడికి ఈ వివరాలు చెప్పిపోదామనే వుద్దేశంతో నేనొక్కణ్ణీ ఇక్కడే వుండిపోయా "నని చెప్పి ముగించాడు.



ఈ మాట విన్నదే పురుషోత్తముడు మరీ తొందరపడ్డాడు. అప్పుడు వృద్ధుడు ఒక గొడ్డలి తెచ్చి యిచ్చి, అతన్ని ఆశీర్వదించి పంపాడు.

గొడ్డలి బుజాన వేసుకుని బయలుదేరాడు పురుషోత్తముడు. సరోవరము మాయమైంది. గొప్ప శబ్దం చేసికొంటూ లెక్కలేని అలలతో సముద్రం కనబడింది. బ్రహ్మాండమైన అలల మధ్యని ఒక గొప్ప రావిచెట్టు మునిగిపోతున్నట్టు అగుపించింది. ధైర్యంతో అలలమధ్యకు దూకి ఆ చెట్టుకొమ్మలు నరకటానికి ప్రారంభించాడు. సూర్యచంద్రులను పోలిన ఇద్దరు

దివ్యపురుషులు ప్రత్యక్షమై "ఏమయ్యా! నీవెవరవు? ఈ మహావృక్షాన్ని ఎందుకిలా పడకొట్టవేస్తున్నావు?" అంటూ గద్దించబోగా ఇంతవరకు జరిగిన సమాచారమంతా పురుషోత్తముడు వారికి వినిపించాడు.

అందులో ఒకాయన "అబ్బాయీ! నీ దీక్షకూ అసక్తికీ సంతోషించాము. ఇదుగో ఈయన మహా శిల్పి. నీవు దేనికోసమైతే తపించుతున్నావో ఆ విగ్రహం చేయటానికి ఈయనొక్కడే సమర్థుడు" అని చెప్పి మాయమయ్యాడు.

పురుషోత్తముడు చూస్తూవుండగానే, అతడు నరికిపడవేసిన కొమ్మలతో ఆ శిల్పి మూడు విగ్రహాలు చెక్కి రాజుకి చూపాడు. "భక్తాగ్రేసరా! ఇది శ్రీకృష్ణుని విగ్రహం. ఈయన బలరాముడు. ఈమె సుభద్రా దేవి," అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

పురుషోత్తముడు ఆ విగ్రహాలకు సాగిలబడి వేడుకునేసరికి, అందులో కృష్ణ విగ్రహం నిజరూపంతో ప్రసన్నమై "ఇంద్రద్యుమ్నా! నీ పట్టుదలకు మెచ్చాను. ఈ క్షేత్రం నీపేరనే శాశ్వతంగా వుండిపోతుంది. ఈ మర్రిచెట్టుకి నైరృతి భాగాన వుండే మండపం దగ్గర నన్ను ఆవాహనం చేసి, ఆషాఢమాస శుక్లపక్షంలో పంచమి తిథి మఖా నక్షత్రమందు ప్రారంభించి ఏడు రోజులు దీక్షగా పూజించినవారికి పునర్జన్మ లేదు. నీవు పదివేల తొమ్మిదివందల యేళ్లు పాలించి తరువాత పరమపదం చేరుకోగలవు" అని చెప్పి అదృశ్యుడైనాడు.

ఇంద్రద్యుమ్నుడు అతి వైభవంతో ఆ మూడు విగ్రహాలనూ తీసుకపోయి గుడిలో ప్రతిష్ఠింపించాడు. భయంకరమైన సముద్రం మాయమై, మహిమగల సరోవరం మళ్లీ ఎప్పటిలాగా ఏర్పడి ప్రజలకు క్షేమం చేకూరింది. అప్పటినించీ ఈ 'పురుషోత్తమక్షేత్రం' మన దివ్యక్షేత్రాలలో ఒకటై వున్నది.






## 11

[రాక్షసుణ్ణి గురించిన రహస్యం తెలుసుకున్నాముగదా అని సంతోషించేటంతలో మన కవలలు ఎలా పట్టుబడిపోయినదీ, ఆ తర్వాత వాళ్లు రాక్షసుడి మోసంలో పడి ఎలా శిలాప్రతిమలుగా మారిపోయినదీ, క్రిందటినెల చదివారుకదా? ఆ తర్వాత—]

రాక్షసుడిచేతిలో కవలసోదరులు చిక్కపోవటమూ, ఆ తర్వాత వాడి తమ్ముడు వాళ్ళను తన వెంట తీసుకుపోవటమూ, యిదంతా కొలనులో హంసలరూపంలో వున్న రాకుమార్తెలు చూస్తూనే వున్నారు. రాక్షసులిద్దరుకూడా గమనించని విషయంకూడా వాళ్లు చూచారు. అది ఏమిటీ అంటే ఉదయనుడు డబ్బీతీసి తెల్లభస్మం మీద చల్లుకోబోయేసరికల్లా రాక్షసుడు రావటం జరిగింది. ఆ తొందరపాటులో భస్మం చల్లుకోలేకపోగా డబ్బీ కాస్తా క్రింద పడిపోయింది. దాన్ని తిరిగి తీసుకుందామంటే వీలుగాక అక్కడే వదిలేశారు.

రాక్షసులు ఎవరిదారిన వారు వెళ్ళిపోగానే రాకుమార్తెలు కొలనులోంచి బైటికి వచ్చి ఆ డబ్బీకోసం వెతికారు. కాని అది కనుపించలేదు.

ముగ్గురూ ఆశ్చర్యపోయారు. "ఇదేమిటి చిత్రంగా వున్నదే! ఆ డబ్బీని మనం ముగ్గురం చూస్తూనేవుంటిమి కదా? ఎలా మాయమయివుంటుంది? ఇక్కడే ఎక్కడో ఉండివుండాలి. వెతుకుదాం రండి" అన్నది సుహాసిని.

అలాగే వాళ్లు ముగ్గురు చుట్టుప్రక్కల వెతుకుతూపోగా కొలనుకు చాలాదూరాన ఒకచోట డబ్బీ కనుపించింది.




ఇక వాళ్లు డబ్బీని ఎక్కడ దాచటమా అని. ఆలోచించి ఆలోచించి, చివరకు కొలను ఒడ్డునే ఒకచోట చిన్న గుంటత్రవ్వి దానిలో కప్పెట్టారు.

ఆ క్షణం మొదలుకొని వాళ్లు కవల సోదరులను రక్షించే మార్గం ఏమిటా అని ఆలోచించసాగారు. చివరకు ఒకనాడు సుకేశిని, "నాకు ఒక ఉపాయం తోచింది చెప్పనా?'' అన్నది.

ఇది విని సుభాషిణీ, సుహాసినీ ఏమిటా ఉపాయం?" అని ఉత్సాహంతో అడిగారు.

అప్పుడు సుకేశిని—"ఎలాగైనా రాక్షసుణ్ణి అక్కడనుంచి కదిపి యువతలకు తీసుకురావాలి. ఇది ఒకలా చెయ్యవచ్చు. మనమందరము కలిసి వాడిదగ్గిరికి పోయి, నృత్యం చేసి చూపుతామని నమ్మించుదాం. ఇలా మనలో వెళ్లదలిచిన ఎవరో ఒకరు కొంత మంత్రజలాన్ని తీసుకువెళ్లి, ఆ కుర్రవాళ్ల శిలాప్రతిమలమీద చల్లి వాళ్లకి మామూలు స్వరూపాలు తెప్పించాలి. రాక్షసుడి కంటపడకుండా ఒకళ్లం అక్కడే వుండిపోయి ఈ పని చెయ్యవచ్చు. తర్వాత ఏమి చెయ్యటమా అనేది కుర్రవాళ్లనే సంప్రతించవచ్చు" అన్నది.

ఇదివిని సుహాసిని, "వాడేం సామాన్యుడా మన టోపీలో పడటానికి. ఒకవేళ మనం వాణ్ణి టోపీవేసి అక్కణ్ణించి యివతలకు తీసుకురాగలిగినా. వాడి భవనంలో వుండి వాడి కన్ను కప్పి ఇంత చెయ్యటం మాటలా? మనంకూడా చిక్కిపోయామా అంటే మన సంగతీ ఆ కుర్రవాళ్ల సంగతీ మనవాళ్లకు తెలిసే అవకాశం కాస్తా పోతుందే. ఈ ఉపాయమేమో బాగానే వుంది, కాని ఆచరణమటుకు అసాధ్యమనిపిస్తున్నది" అని అన్నది.

అందుకు సుకేశిని—"సరేలే. ధైర్యం లేకపోతే ఎవరూ ఏపనీ చెయ్యలెరు.

అపాయంలో చిక్కుకుంటామని చెప్పి రక్షించకుండా ఉండగలమా?" అన్నది. సుహాసినీ, సుభాషిణీ ఔనౌనన్నారు.

మర్నాడు కొలనులోవున్న హంసలన్నీ ఒడ్డుకి వచ్చినై. రావటంతోటే వాటికి మను ష్యాకారాలు వచ్చినై. మనరాకుమార్తెలకు మల్లేనే వాళ్లంతా రాక్షసుడి చేతిలో చిక్కి పోయినవాళ్లే. వాళ్లలో ఆడపిల్లలు వున్నారు, మగపిల్లలూ వున్నారు.

మగపిల్లలందరినీ కొలనులోకి తిరిగి వెళ్లిపొమ్మన్నది సుహాసిని. అలాగే వాళ్లు వెళ్లిపోయారు. తక్కినవాళ్లంతా ఆడపిల్లలే. వాళ్లంతాచేరి, ఆ తోటలో పువ్వులు కోసుకుని చక్కా అలంకరించుకుని పాడుకుంటూ, రాక్షసుడి భవనంవైపుకి రాసాగారు.

ఈ సందడి చెవినిపడేసరికి రాక్షసుడే వాళ్లకు ఎదురువచ్చి, "ఇదేమిటి? యిలా బయలుదేరా రెక్కడికి? నా మీద దాడి చేద్దామనా?" అన్నాడు చిద్విలాసంగా.

అందరిలోకి ముందున వున్న సుకేశిని "నీ అంతటివాడిపైన దాడి చెయ్యటం ఎవరి తరం? క్రొత్తగా చిక్కిన ముగ్గురు కుర్రవాళ్లూ ఏమైపోయారో చూతామని వచ్చాం" అన్నది.



అందుకు రాక్షసుడు పగలబడి నవ్వుతూ "ఏమవుతారు? అంతకుముందు వచ్చిన వాళ్లేమయ్యారో, వీళ్లూ అంతే. ఏం, చూస్తారా?" అంటూ భవనంలోకి వెంట బెట్టుకువెళ్లి కవలసోదరుల శిలాప్రతిమలు వరసన ఒక్కొక్కటిగా చూపాడు.

వాటినిచూస్తూ సుకేశిని, "బాగానే వున్నది నీవుద్యోగం. కాని, నాకొక సందేహం తీర్చు. యింత మంది మి కలిసి మెలిసి వుంటున్నా ఈ నిర్బంధంతో ప్రాణం విసిగి పోయి, మీ అన్న చేయదలుచుకున్న బలి త్వరగా అయిపోతే బాగుండునే అనిపిస్తున్నది మాకు. అటువంటిది నువ్వు ఒక్కడివీ ఈ



శిలాప్రతిమలమధ్య విసుగూ విరామం లేకుండా ఏళ్లతరబడి ఎలా కాపలా కాస్తున్నావయ్యా?" అని నిబ్బరంగా అడిగింది.

అందుకు రాక్షసుడు—"నాకుమాత్రం విసుగెత్తటం లేదనుకున్నారా? కాని ఏం చేయటం? ఈ చోటువిడిచి వెళ్లానో మిమ్మల్ని బలియివ్వటానికి ముందు నన్నే హతమారుస్తాడు మా అన్న. ఏమీ తోచక నేనూ సతమతమవుతూనే వున్నాను" అని మనసులో బాధ వెలిపుచ్చాడు.

వెంటనే సుకేశిని అందుకున్నది—"ఎంతసేపని యిలా? పోనీ కాస్సేపు మాతోపాటు వచ్చి కులాసాగా ఉండకూడదా? నీకు ఆనందం కలిగేటట్టు ఆటలాడతాం, పాటలు పాడతాం. మాకూ కొంత ఊసుపోతుంది. రా, చూదుగాని తమాషా" అని హుషారీ చేసింది.

"అమ్మయ్యో! ఈ భవనం విడిచి వచ్చేయటమే? ఏనుగంతవాణ్ణి నేను కాపలా కాస్తుండగానే నా కళ్లల్లో దుమ్ముకొట్టి ఈ కుర్రవాళ్లు ఎలాగో ప్రవేశించారే, భవనం వదిలితే మరేమైనా వుందా?" అన్నాడు.

"అః—నీ భ్రమగాని యిక్కడికి ఎవరు రాగలుగుతారు? వచ్చారే అనుకో. నీచేతిలో చిక్కక ఎక్కడికి పోగలరు? పోనీ మాలో ఒకరు నీబదులు కాపలా కాస్తూవుంటాము. కాస్సేపు కులాసాగా కాలక్షేపం చేసి, తిరిగి నీ ఉద్యోగానికి నువ్వు పోదువుగాని" అన్నది సుకేశిని. ఈ మాట రాక్షసుడికి నచ్చింది.

"మరైతే నాబదులు కాపలా కాసేది ఎవరు?" అని అడిగాడు.

సుకేశిని సుహాసినివైపు అట్టె చూసి, "మరెవరోనా? మా అక్కే ఉన్నది" అన్నది. ఆప్రకారమే సుహాసినిని భవనంలో వదిలి వాళ్లు కొలనువైపుకి బయలుదేరారు.

కొలను ఒడ్డున వాళ్లు రాక్షసుణ్ణి మధ్య కూర్చోపెట్టి చుట్టూ చేరి నృత్యం చెయ్య



సాగారు. వాళ్ల ఆటపాటలకు రాకసుడు తన్మయుడై "రోజూ యిలా కాలక్షేపంచేస్తే బాగుండునే" అన్నాడు.

రోజూ ఎవరో ఒకరు రాకసుడిబదులు కాపలా కాస్తుండటమూ, వాడు ఆటపాటలకు ఆనందించటమూ అలవాటైంది.

నాలుగురోజులు గడిచేసరికి, అంతకు మునుపు భవనంవిడిచి రావటానికి భయపడే రాకసుడు, యిప్పుడు తనంతట తనే వచ్చి రాకుమార్తెలను రమ్మనటం మొదలు పెట్టాడు. ఇది చూచి సుకేశిని తన పాచిక పారిందికదా అని సంతోషించింది.

ఇంతవరకూ బాగానే వుంది. పోతే, కవలల శిలాప్రతిమలను మంత్రజలంతో మామూలు మనుష్యులుగామార్చివేయాలి. జలం తీసుకురావాలంటే ఏదైనా ఉపకరణ ఉండాలి. పోనీ పాత్ర ఎక్కడైనా సంపాదించి తెచ్చి, దానితో జలం తీసుకవద్దామా అంటే ఉన్నపాటున రాకసుడికి పట్టుపడి పోతారేమో! మరేమిటి గత్యంతరం? మళ్లీ ఆలోచనపడింది. ఐతే,—సుకేశినివంటి తెలివిమంతురాలికి ఇదొక ఘనకార్యమా!

మర్నాడు రాకసుణ్ణి పిలుచుకురావటానికి వెళ్లేముందు సుకేశిని తోటలోకి పోయి మంత్రజలంతో తనచీరెచెంగు ఒకటి బాగా తడుపుకొన్నది. రెండో చివర కొలను నీటితో తడుపుకొన్నది.

ఇలా తయారైన సుకేశిని రాకసుడి దగ్గరకు వెళ్ళి, "యివాళ కాపలాకాయటం నావంతు. నేను లేకుండా మావాళ్ల ఆటపాటలు నీకు ఎలా నచ్చినయ్యో వచ్చి నాకు చెప్పాలిసుమా" అన్నది. "అలాగే" అంటూ రాకసుడు క్షణమైనా అక్కడ నిలవకుండా కొలనుకి బయలుదేరాడు. వాడు వస్తుండటం చూచి కొలనులోని రాకుమార్తెలు వెంటనే ఆటపాటలలో మునిగిపోయారు.




రాక్షసుడు భవనం విడిచి వెళ్లిన మరుక్షణమే సుకేశిని, సోదరుల శిలాప్రతిమల పైన చీరెచెంగుతో తెచ్చిననీటిని పిండింది. వెంటనే వాళ్లకి మామూలు స్వరూపాలు వచ్చేసి—"ఇదేమిటి? యిక్కడికెలా వచ్చావ్? వాడేమయ్యాడు?" అన్నారు ఆశ్చర్యపోతూ.

అప్పుడు సుకేశిని తను పన్నిన పన్నాగం విప్పిచెప్పి, "వాడు ఆటపాటలలో పరవశుడైవున్న సమయం కనిపెట్టి, పొంచి, హతమార్చేయాలి. ఆలోచించండి ఉపాయం" అని వేగిరపెట్టింది.

"ఎలా సాధ్యం? ఆ భస్మంకూడా పోగొట్టుకున్నామే?" అన్నాడు ఉదయనుడు.

భస్మంసంగతి సుకేశిని మరిచేపోయింది. వాళ్లు ఈ సంగతి గుర్తుతేగానే "అన్నట్టు అవును. ఒకలాచేద్దాం. ఇవ్వాళ్టికి మిమ్మల్ని శిలాప్రతిమలుగా చేసిపోతాను. రేపు వచ్చేటప్పుడు భస్మంకూడా తెస్తాను" అన్నది.

ఇందుకు సోదరులు చాలా సంతోషించారు. వెంటనే సుకేశిని కొలను నీటితో తడిపిన చీరెచెంగు పిండి, వాళ్ల నోళ్లల్లో పోసింది. యథాప్రకారం వాళ్లు శిలాప్రతిమలుగా మారిపోయారు.



ఇంతలో రాక్షసుడు అక్కడికి వచ్చేసి, "ఎలాగైనా నువ్వు వుంటేనేమజా. ఇవ్వాళ అంతా చప్పచప్పగా వుంది". అన్నాడు సుకేశినితో.

"నిజంగా ? ఎగతాళి చేస్తున్నావ్? ఐతే రేపు నేను సభలో వుంటాలే. మా అక్కనే యిక్కడ కాపలాకు పంపుదాం" అంటూ తిరిగి కొలనువద్దకు వచ్చి చేరుకున్నది.

తర్వాత రాకుమార్తెలు ముగ్గురూ కలిసి భస్మాన్ని తీసుకురావటానికి వెళ్లి గుంట తవ్వి చూడగా డబ్బీ కనపడకపాయె! ఏమి చెయ్యటానికీ వాళ్లకి పాలుపోయింది కాదు. "అప్పుడు సుకేశిని, "విచారిస్తూ కూర్చుంటే ప్రయోజనం ఏమున్నది? ఇవాళ భవనం కాపలాకు నువ్వు వెళ్లు. యిలా యిలా జరిగిందని కుర్రవాళ్లకు తెలియజెప్పు. ఆపైన వాళ్లు చెప్పినట్టు చేదాం" అని చెప్పి సుభాషిణిని పంపింది.

సుభాషిణి కూడా మంత్రజలంతోనూ, కొలనుజలంతోనూ చీరెచెంగు తడుపుకొని భవనానికి వెళ్లి, రాక్షసుణ్ణి విడుదలచేసి పంపింది. వాడు వెళ్లిపోగానే సుభాషిణి చీరె చెంగునుండి నీటిబొట్లు శిలాప్రతిమలపైన వేసింది. కాని పాపం ఆ తొందరలో సుభాషిణి మంత్రజలంతో తడిసిన చెంగు పిండటానికి బదులు కొలను నీటితో తడిసిన చెంగు పిండింది. అందుచేత శిలాప్రతిమలకు మామూలు స్వరూపం రాలేదు. "అరెరే! ఎంత పొరపాటు జరిగింది" అనుకుంటూ సుభాషిణి ఈసారి మంత్ర-జలాన్ని పిండింది. వెంటనే సోదరులు అసలురూపాలతో లేచారు.

అప్పుడు సుభాషిణి, భస్మం మాయం కావటం సంగతి చెప్పి, జలం వాడటంలో తనుచేసిన ప్రమాదంకూడా వెల్లడించింది.

అందుకు ఉదయనుడు, "ఇదంతా చూడగా, మనం తలపెట్టినపని ఏదీ జయ

ప్రదం కాదని తోస్తున్నది. లేకపోతే అడుగడుగునా ఈ అవాంతరా లేమిటి ?" అన్నాడు నిస్పృహతో.

మధ్యలో నిశీధుడు అడ్డపడి, "జయప్రదం కాకపోవడమేమిటి. దేవుడు మనల్ని పరిక్షిస్తున్నాడు; అంతే. ఇంతమాత్రానికే జడిసిపోవటమా ?" అన్నాడు.

"సరే, వాడు తిరిగి భవనం చేరుకొనే సరికల్లా మనం తప్పించుకొని పోవాలి. లేదా,...?" అని ఏమో చెప్పబోతుండగా—

సుభాషిణి అడ్డుతగిలి, 'నాకు ఒక ఉపాయం తోస్తున్నది. ఇక్కడ వుండే ఆ ప్రతిమలలో మూడింటిని తెచ్చి మీ స్థానాల్లో వుంచుదాం. వాడు ఏనుగంత మనిషేకాని బుర్రమాత్రం వట్టి మట్టిబుర్ర. కాబట్టి ప్రతిమలు మార్చిన సంగతి వాడు చచ్చినా కనిపెట్టలేడు. మీరు బైట ఆ పొదచాటున దాక్కోండి. వాడు భవనంలోపలికి పోగానే మీరు మా దగ్గరికి వచ్చేయండి. చూదాం తర్వాత సంగతి" అన్నది.

సుభాషిణి చెప్పిన ఈ ఉపాయం బాగుందంటే బాగుందన్నారు మన కవల సోదరులు. ఇంకా ఆలస్యం ఎందుకని ఆ వెంటనే నలుగురూ చేరి మూడు శిలాప్రతిమల్ని తెచ్చి తమస్థానే వుంచి, బయటకు వచ్చి ఒక పొదచాటున నక్కి వున్నారు.

కొంచెంసేపటికల్లా రాక్షసుడు తిరిగివచ్చి సుభాషిణిని విడుదల చేశాడు. వెంటనే సుభాషిణి కవల సోదరులున్నచోటికి వెళ్లి వాళ్లతోసహా కొలను చేరుకున్నది.

---

[యింతకాలమూ తమను ఇతరుల కంటికి కనుపించకుండా చేసి, ఉపయోగపడుతూవచ్చిన ఆ భస్మం కాస్తా పోయినతర్వాత కవలసోదరులు ఏమి చిక్కులకు గురి అయారు ? వాళ్లు తనని టోపీవేసి ఉడాయించిన సంగతి రాక్షసుడు కని పెట్టగలిగాడా ?—మొదలైన చిత్రాలు వచ్చేనెల]






పూర్వకాలమందు వారణావతమనే రాజ్యానికి బ్రహ్మదత్తుడు ప్రభువుగా ఉండేవాడు. ఆయన బలశాలి. అపరిమితమైన రాజ్యకాంక్ష కలవాడు. తనను ఎదిరించలేవని తోచిన చిన్న రాజ్యాలు ఎన్నిటినో కొల్లగొట్టి జయించాడు. ఐనా తృప్తి తీరలేదు.

ఒకప్పుడు పాపం, చేరువనే చిన్నదైన కోసలరాజ్యంపై దండెత్తి సులువుగా హస్తగతం చేసుకున్నాడు. కోసలకు అధిపతి దీర్ఘహేతి. బలవంతుడు పైబడినప్పుడు చిన్న రాజు చేయగలదేమున్నది? గర్భవతిగాఉన్న భార్యతో సహా పలాయనమైపోయి మారువేషంతో ఒక శిల్పకారుని ఇంట కాలక్షేపం చేయసాగాడు.

బ్రహ్మదత్తుడు కోసలరాజ్యాన్ని జయించాడే కాని, ఆనందం కనబడలేదు. ఎందుచేతనంటే దీర్ఘహేతి యితర రాజులంత భీరువు కాదు. శౌర్యపరాక్రమాలకు అతని వంశం పెట్టింది పేరు. 'యితర చిన్నరాజులంతా ఒకయెత్తు. ఈ దీర్ఘహేతి ఒకయెత్తు. ఇతనిని వెతికిపట్టి హతమార్చి తీరాలి' అని నిశ్చయించుకుని బ్రహ్మదత్తుడు రాజ్యం నలువైపులకు చారులనుపంపాడు.

అక్కడ దీర్ఘహేతి—అజ్ఞాతంగా శిల్పకారునియింట వుంటున్నప్పుడే భార్య ప్రసవమై మగపిల్లవాణ్ణి కన్నది. అప్పుడు దీర్ఘహేతి "దేముడు మనని పరీక్షిస్తున్నట్లున్నాడు. ఇప్పుడు చెయ్యవలసిందల్లా ఒక్కటే. రాజభటులకు చిక్కటం ఎలాగూ తప్పదు. కనుక పిల్లవాడైనా బ్రతికేమార్గం చూడాలి" అని నిశ్చయించుకున్నాడు. పిల్లవాడికి 'దీర్ఘాయువు' అని పేరుపెట్టి, అతనిని దూరప్రాంతాన ఒక విప్రునియింట వప్పగించారు. కుమారుణ్ణి వదిలివస్తూ, తన ఖడ్గాన్నికూడా అక్కడ వదిలి, "వీడు పెరిగి పెద్దయాక దీనిని యివ్వ"మన్నాడు.

బి. హనుమంతయ్య, వరంగల్లు




దీర్ఘహేతి భయపడినట్టుగానే మరికొద్ది రోజులకల్లా చారులువచ్చి అతనిని భార్యతో సహా పట్టివేశారు. "ఆ బుడుతడెక్కడ?" అని గద్దించి అడిగారు. "నేను చెప్పను" అన్నాడు దీర్ఘహేతి.

"ఊఁ...ఎలా చెప్పవో చూదాం పద రాజుగారివద్దకు" అంటూ వాళ్లని బంధించి తీసుకుపోయారు. వాళ్లని చూస్తూనే బ్రహ్మదత్తుడు, "కుర్రవాడేడయ్యా" అన్నాడు.

అందుకు దీర్ఘహేతి 'నీకు కావలసిన దల్లా నా రాజ్యం. అది కాస్తా కాజేశావు. అప్పటికీ తృప్తిలేక మమ్మల్ని బంధించావు. కావాలంటే మా ప్రాణాలు తీసుకో. ఏ పాపమూ ఎరుగని పసికూన సంగతి నీకెందుకు?" అన్నాడు.

బ్రహ్మదత్తుడు–"మీ ప్రాణాలతో నాకు పనేమిటి? మీ వంశాంకురం లేకుండా చెయ్యాలి. నీ కొడుకుజాడ చెప్పు. అలా ఐతే మిమ్మల్ని బంధిస్తానేగాని ప్రాణాలు తియ్యను" అన్నాడు. "చెప్పను. ఇష్టమొచ్చినట్టు చేసుకో" అన్నాడు దీర్ఘహేతి.

మారు ఆలోచన లేకుండా నిరపరాధులైన ఆ దంపతులను నిర్దాక్షిణ్యంగా చంపించివేశాడు బ్రహ్మదత్తుడు.

అజ్ఞాతంగా దూరదేశాన పెరిగి పెద్ద అవుతున్న దీర్ఘాయువుకు ఈ సందర్భాలన్నీ చెవినిబడినై. బ్రహ్మదత్తునికి ఎలా శాస్తిచేయటమాఅని అతనిహృదయం వేగిపోతున్నది.

బ్రహ్మదత్తుడు దీర్ఘాయువుజాడ తీయలేకపోతిమే అని భయంతోనూ, బెంగతోనూ మనస్తిమితంలేక కుమిలిపోజొచ్చాడు.

దీర్ఘాయువు పేరు మార్చుకుని, బ్రహ్మరుద్రులుసైతం తనను ఫలానా అని కనిపెట్టసాధ్యంకానివిధంగా మసులుకుంటూ వచ్చాడు. నెమ్మదిగా బ్రహ్మదత్తుని కొలువులో ప్రవేశించి అశ్వశాలలో పనిచేయనారంభించాడు.



అతని వినయవిధేయతలు, ప్రజ్ఞాధిక్యతలు త్వరలోనే ప్రభువు దృష్టిని ఆకర్షించినై. ఆస్థానంలో అందరకూ తలలో నాలుకగా సంచరిస్తూవున్న ఆ చిన్నవానిని ఎదుటికి రప్పించి కొంచెంసేపు సంభాషించేసరికే బ్రహ్మదత్తుడు ఉప్పొంగిపోయి దీర్ఘాయువుకి ఒక గొప్ప ఉద్యోగమిచ్చాడు.

అంతే కాదు. దీర్ఘాయువు బ్రహ్మదత్తునికి పంచప్రాణాలలో ఒక ప్రాణమయ్యాడు. నిమిషముసేపైనా బ్రహ్మదత్తుడు అతనిని విడిచిపెట్టి ఉండలేనంత మమత కుదిరిపోయింది. ఇలావుండగా ఒకరోజున రాజు దీర్ఘాయువును వెంటబెట్టుకుని వేటకు వెళ్లాడు. పరివారాన్నంతటినీ ఒకచోట వదిలి, వీరిద్దరుమాత్రం చాలా దూరం నడిచిపోతూవుండగా కొంతసేపటికి బ్రహ్మదత్తుడికి అలసటవచ్చి, దీర్ఘాయువు తొడమీద తల పెట్టుకుని గాఢనిద్రలో మునిగాడు.

బ్రహ్మదత్తుడు అదమరచి నిద్రిస్తూవున్న ఆ సమయంలో దీర్ఘాయువుకు అనేకమైన ఆలోచనలు పోయినై. "అకారణముగా నా తండ్రి రాజ్యాన్ని లాక్కొన్న ద్రోహి వీడు. రాజ్యానికేమి? ఐశ్వర్యాదులు రావచ్చు, పోవచ్చు. నిర్దోషులైన నా తల్లినీ తండ్రినీ నిష్కారణంగా పొట్టను పెట్టుకొన్న హంతకుడు! ఇటువంటి పరమ దుర్మార్గుణ్ణి ఏమి చేస్తే పాపమున్నది! వీడిని సంహరించటంతో ఒక మహాపాతకుడి భారం భూదేవికి తగ్గించటమే గాక, వీడి దుండగాలకు పాల్పడిన చిన్న చిన్న రాజులెంతోమందికి ఉపకారం చేయగల్గుతాను. నిమిషమైనా ఇక జాగుచేయకూడదు...." అనుకొంటూ ఆవేశంతో చర్రున కత్తి దూశాడు! కాని, మరుక్షణమందే తండ్రి చెప్పినమాట యేదో మెరుపులా మెరిసి కత్తి మళ్లీ ఒరలో దోపివేశాడు.

ఇంతలో రాజు ఉలిక్కిపడి లేచి, భయకంపితుడై చూస్తూ కూర్చున్నాడు. దీర్ఘాయువు 'ఏమిటిది ప్రభూ!' అని అడిగాడు ఆశ్చర్యంగా. అందుకు బ్రహ్మదత్తుడు "ఇదేనోయి నేస్తం! ఇది ఒక్కటే నా జీవితంలో పట్టుకొన్న పీడ. నాకు ఒకే ఒక బద్ధశత్రువున్నాడు. ఆ బాలుని పేరు దీర్ఘాయువు. వాడు నాపైన పగపట్టి ఉన్నాడట! చారులు నాకీ వర్తమానం చెప్పినప్పటినుండీ అంతులేని మనోవ్యథ పొందుతున్నాను. కన్నుమూసినా తెరచినా నాకొక బాలుని స్వరూపం కనబడుతూవుంటుంది. వాడు భయంకరరూపం తాల్చి, కత్తిదూసి నన్ను సంహరించబోతున్నట్టు కలలు గంటూవుంటాను. ఇప్పుడూ అటువంటి కల రావటంవల్లనే ఉలిక్కిపడ్డాను' అని తను దీర్ఘహేతిని పీడించిన విధము అక్షరమైనా పొల్లుపోకుండా దీర్ఘాయువుతో చెప్పివేశాడు.

"రాజా!"—అని పిలిచాడు దీర్ఘాయువు. తలయెత్తి చూచాడు రాజు. దీర్ఘాయువు ఒక్కసారి కత్తిదూసి, "బ్రహ్మదత్తా!—నీవు కలలు గంటున్న ఆ దీర్ఘాయువు వీడే! నీవు చేసిన ద్రోహాలకు శాస్తి చేయటానికే వీడు నీ ఆస్థానంలో ప్రవేశించింది. నీ ప్రాణాలు వీని చేతిలో ఉన్నవి. కావాలంటే వానిని తీసివేయటం క్షణం పట్టదు. కాని నాతండ్రి చెప్పినమాట తరుణంలో జ్ఞాపకం రావటంచేతనే నీవింకా బ్రతికిఉన్నావు. ఇంతటినుండి దీర్ఘాయువు నీకు శత్రువు కాడు. వానివల్ల నీకు హాని జరుగబోదని మాట యిస్తున్నా..." అని చెబుతూ తండ్రి పేరుతోవున్న కత్తి చూపించాడు.

ఈ మాట వింటూనే బ్రహ్మదత్తుడు "దీర్ఘాయూ!—ఇంతటి ఉదారుడా నీ తండ్రి! అటువంటి మహానుభావుణ్ణా చంపివేశాను!!" అంటూ బాలుని కౌగిలించుకుని అతని ఒడిలో మూర్ఛపోయాడు.






విజయవాడ గవర్నరుపేటలో గవ్రరాజుకి చాలా ఇళ్లున్నై. తను ఒకమేడలో ఉంటూ తక్కిన యిళ్లన్నీ అద్దెలకు ఇచ్చాడాయన. వాటిల్లో పెద్ద పెరడున్న చిన్న యిల్లొకటి ఉండేది. అందులో శోభనాద్రిఅనే బడి పంతులొకాయన నెలకు పన్నెండు రూపాయలు అద్దెయిచ్చి కాపురం ఉండేవాడు.

శోభనాద్రి భార్య నర్సమ్మగారికి ఆ యిల్లు అన్నివిధాలాసదుపాయంగానేఉంది గాని పెరట్లోఉన్న పెద్ద జువ్విచెట్టుమాత్రం ఆమెకు అదుటు కలిగించింది. 'జువ్వి చెట్టుంటే దెయ్యాలు చేరతాయి. దెయ్యాలంటే నాకు తగని భయం. కనుక, గవ్రరాజు గారితోచెప్పి చెట్టు కాస్తా కొట్టించి వెయ్యండి' అన్నదామె.

'దెయ్యాలూ లేవు, భూతాలూ లేవు. ఇప్పుడా చెట్టు కొట్టించాలంటే బోలెడవుతుంది. ఈ ఖర్చుకి గవ్రరాజుగారు వప్పుకుంటాడా? ఊరుకో' అని సముదాయించాడు శోభనాద్రి.

అన్నాడే కాని నర్సమ్మగారికి జువ్వి చెట్టంటే భయం అలాగే ఉండిపోయి చీటికీ మాటికి ఆవిడ ఆ మాట తెస్తూనే ఉంది. ఆఖరికాయన ప్రాణం విసిగి ఒకనాడు గవ్రరాజుగారితో తన భార్యకున్న భయం చెప్పి, ఆ చెట్టు కొట్టించివేయవలసిందని కోరేడు.

అందుకు గవ్రరాజు, 'అలాగే కొట్టించేద్దాం. ఇంతకూ అది ఏమంత పనికొచ్చే ఫలవృక్షమేమీ కాదుగదా' అని వప్పుకున్నాడు. చెట్టు కొట్టడానికని కూలివాళ్లకు కబురు చేశాడుకాని అప్పట్లో వాళ్లు సందర్భపడక పనిజరిగిందికాదు. దరిమిలాన అతనికీ శోభనాద్రికీ అద్దెవిషయంలో పేచీ వచ్చి ఈ ప్రయత్నం మానేశాడు. శోభనాద్రి కూడా మళ్లీ ఈమాట ఎత్తలేదు.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు



పేచీ యేమిటంటే, అన్ని పట్నాలలో మల్లేనే విజయవాడలోకూడా ఇళ్లకు గిరాకీ యెక్కువై, ఇంటివాళ్లు అద్దెలు పెంచేశారు. అదును చూసుకుని గవర్రాజుకూడా తనయిళ్లలో కాపురాలున్నవాళ్లందరికి అద్దె లెక్కువచేసి యిచ్చుకోమన్నాడు. అంత వరకూ పన్నెండు రూపాయలిచ్చే శోభనాద్రితో 'మళ్లీ నెలనుంచి మీరు నెలకు పాతికరూపాయలు ఇవ్వాలి' అన్నాడు.

ఆ మాట వినేసరికి శోభనాద్రి గుండె గుభేలుమంది. నా ఆదాయమంతా చేరుస్తే నెలకి తొంభైరూపాయలకన్న ఎక్కువలేదు. ఇంటి అద్దెకే పాతిక యిస్తే, మిగిలినదానితో నా భార్యని, ఆరుగురు పిల్లల్నీ పోషించటం యెట్లాగ?' అన్నాడతడు.

'ఎట్లాగా?' అని నన్నడుగుతే నేనేం చెప్పను? మీరు ఖాళీ చేస్తే ఇప్పుడీయింటికి కళ్లనద్దుకుని ఎవడుపడితే వాడు నలభై ఇస్తాడు. మీరు అంత యిచ్చుకోలేరనే పాతిక అన్నాను!' అన్నాడు గవర్రాజు.

'ఇళ్ల అద్దెలు ఎక్కువ ఐనమాట నిజమే. కాని రెట్టికి రెట్టింపు అడుగుతే ఎలాగ? మరో మూడురూపాయలు ఇస్తాను. ఎక్కువ ఇవ్వలేను' అని బ్రతిమాలేడు శోభనాద్రి.

గవర్రాజు కోపంతో కనుబొమలు ముడిచి, 'ఏమిటీ, ముష్టి మూడురూపాయిలా ఎక్కువ ఇస్తానంటున్నావు? దమ్మిడీ తక్కువైతే వప్పుకోను! అలా యిష్టమైతేనే ఉండు. లేకపోతే ఖాళీ చేసెయ్యి' అని నిష్కర్షగా చెప్పి చక్కాపోయాడు.

శోభనాద్రి మెత్తటి మనిషి అనీ, నాలుగు మాట్లువెళ్లి, వత్తిడిచేస్తే, ఖాళీ చెయ్యక పోడనీ అనుకుని పీడింప నారంభించాడు గవర్రాజు. మరోమార్గం లేని శోభనాద్రి 'కదలను' అని మొండికేశాడు. దానితో గవర్రాజుకు కోపం ఎక్కువై, 'వీళ్లని ఎలాగయినా లేవగొట్టాల'ని పంతం పట్టాడు.



ఈ పేచీ వచ్చిన కొంతకాలానికి ఒక నాటి ఉదయం వీరయ్య అనే కూలివాడు గొడ్డలి ఋజాన్ని తగిలించుకుని వచ్చి 'బాబూ, పక్కవీధి లోగిట్లో జువ్వి చెట్టు కొట్టాలన్నారు?' అని అడిగేడు.

జువ్విచెట్టు మాట రాగానే గవరాజుకి శోభనాద్రి భార్య సంగతి జ్ఞప్తికొచ్చింది. దానితో అతనికి బుర్రలో ఆలోచన ఒకటి మెరుపులా మెరిసింది. వెంటనే 'ఒరేయ్ వీరాయ్! చెట్టు కొట్టడానికేం గాని ఒకపని చెయ్యాలిరా నువ్వు! నేను చెప్పిన పని చేస్తివా, పది రూపాయిలు బహుమతీ ఋస్తాను' అన్నాడు.

'మీమాటకు ఎప్పుడైనా అడ్డుందా బాబయ్యా!' అన్నాడు వీరయ్య.

గవరాజు వాణ్ణి దగ్గిరగా రమ్మని చెవిలో ఏదో రహస్యం చెప్పి, 'శోభనాద్రి ఊళ్లో లేడు. వాడు రాకుండా ఈ రాత్రే ఈ పని జరగాలి' అన్నాడు. 'రేపీవేళకి వచ్చి మీ దగ్గిర బహుమతీ పట్టుకుపోకపోతే అడగండి' అంటూ వెళ్లిపోయాడు వీరయ్య.

భర్త ఊళ్లో లేకపోవటంచేత నర్సమ్మ గారు ఆ రాత్రి భోజనాలు పెందరాళే తెమల్చుకుని, పిల్లల్ని నిద్రబుచ్చి తను కూడా పడుకుంది. అర్ధరాత్రివేళ మంచి నిద్రసమయంలో వాళ్లయింటికప్పుపైన ఒక రాయి పడింది. ఆ చప్పుడుకి ఆమెకు మెలకువ వచ్చి, పందికొక్కో, ఏదో ఐవుంటుందనుకుందామె. ఐనా, చూచివద్దామని పెద్దకూతుర్ని తీసుకుని పెరట్లోకి వెళ్లింది. ఇద్దరూ బయటకు వచ్చేటప్పటికి, జువ్వి చెట్టుమీదనుంచి, హూం, హూం అంటూ భయంకరమైన అరుపొకటి వినపడింది.

నర్సమ్మ అటైు చెట్టుకేసి చూసేటప్పటికి, కొమ్మమీద చిన్న మంట కనపడి గప్పుమని ఆరిపోయింది. ఆవెలుగులో ఏదో భయంకర స్వరూపం 'హూం' అని

అరుస్తూ దభుక్కుమని మీదికి ఉరికినట్లు అయింది. 'అమ్మోయ్ దెయ్యం!' అంటూ మూర్ఛపోయింది నర్సమ్మ.

నర్సమ్మ మూర్ఛపోగానే చెట్టుమీది వీరయ్య దొడ్డమ్మట పారిపోయాడు.

నర్సమ్మ కూతురు హడిలిపోయి బొబ్బలుపెట్టేటప్పటికి వీధిలో ఉన్న ఇళ్ల వాళ్లందరూ లేచి, 'ఏమిటేమిటి?' అంటూ పరుగెత్తుకొచ్చారు. నర్సమ్మగారి స్నేహితురాలు అన్నపూర్ణమ్మకూడా వచ్చింది. ఆవిడ నర్సమ్మగారిని సేదదీర్చి, తల్లినీ పిల్లల్నీ తనయింటికి తీసుకుపోయి పడుకోబెట్టుకుంది. తెల్లవారేకకూడా నర్సమ్మకు జువ్విచెట్టుమాటా,దెయ్యంమాటా జ్ఞాపకానికొచ్చినప్పుడల్లా గుండె ఝల్లుమంటూనే వుంది. ఎవరెంత ధైర్యంచెప్పినా గుండె నిబ్బరం చాలక 'ఈజన్మలో ఆయింటికి వెళ్లను' అనేసింది నర్సమ్మగారు. ఆవిడ అవస్థచూచి జాలిపడి అన్నపూర్ణమ్మగారు తమ యింట్లోనే ఒక గదీ వసారా ఖాళీచేసి వాళ్లని ఉండిపొమ్మంది.

శోభనాద్రి ఊరునుంచితిరిగొచ్చి సంగతి సందర్భాలన్నీ తెలుసుకుని, మర్నాడే గవ్రరాజు ఇల్లు ఖాళీచేసి వప్పగించేశాడు.

తన పన్నాగం ఫలించినందుకు గవ్రరాజు సంతోషించి ఎగిరి గంతేశాడు. ఐతేం, అవసరంకొద్దీ కొందరువచ్చి, ఇల్లుచూచుకొని మళ్ళీ వస్తామని చెప్పిపోతున్నారు. తీరా వాళ్లు యింటికివెళ్లి 'ఇల్లుదొరికిం' దనే శుభవార్త ఆడవాళ్లతో చెప్పేసరికి, 'ఓహో, అదా, గవ్రరాజుగారి యిల్లా? పెరట్లో జువ్విచెట్టున్న యిల్లేనా? ఐతే మేం ఉండలేం బాబూ ఆ దెయ్యాలకొంపలో! ఎన్నిబాధలైనా పడతాం. ఆ కొంపమటుకి మనకు వద్దే వద్దు' అని అనేస్తూ వచ్చారు. ఊళ్లో ఆడవాళ్లందరకూ ఇలా భయంపుట్టి, వాళ్లు మొగ్గకపోయేసరికి నాటికీ నేటికీ ఆ యిల్లు ఖాళీగానే వుండిపోయింది!






కొన్నివందల సంవత్సరాలక్రిందట జపాను దేశంలో ఓమజో అనే భూస్వామి ఉండేవాడు. అతనికి ఒక్కగానొక్క కొడుకు హిట్సు. వీరికి మూడు ఎకరాల చక్కని మాగాణి వుంది. ఈ మూడు ఎకరాలలో సేద్యం సాగించితే వారికి తిండి అమరటమే గాక కొంత ధాన్యం నిలవ చేసుకోవచ్చు. కాని చిత్రమేమిటంటే ఓమజో రెండు ఎకరాలనే పంటకు వుపయోగించుకుని మిగతా ఎకరం గోభూమిగా వదిలేశాడు.

హిట్సుకి యిది ఏమాత్రం నచ్చలేదు. "ఏ సంవత్సరపు పంట ఆ సంవత్సరం యిలా పూర్తిచేసుకు కూచుంటే, కరువు కాటకాలొస్తే మన గతి ఏంకావాలి? ముందు సంగతి కాస్తంత ఆలోచించుకోవద్దా" అని సతపోరుతుండేవాడు.

కాని ఓమజో తన నిశ్చయాన్ని మార్చుకొనదలచలేదు. "అబ్బాయీ! నువ్వ చెప్పిందీ బాగానే వున్నది. కాని నీకు ఎంతసేపటికీ 'మన సంగతేమవుతుందీ!' అనే గాని నోరులేని ఆ మూగజీవాల సంగతేమైనా ఆలోచించావా? మనతిండికి యిన్నిగింజలు లభిస్తున్నవీ అంటే అదంతా వాటి శ్రమ ఫలితమే కదా! అటువంటివాటికి తగిన పోషణ జరగక అవి మూలబడితే మనగతి ఏమవుతుంది? వాటిసంగతి చూడటం మన విధి" అని నచ్చజెపుతుండేవాడు ఓమజో.

ఈవిధంగా ఎన్నోసార్లు తండ్రీ కొడుకుల మధ్య వాదనజరుగుతుండేది. అప్పుడప్పుడు వూరిలో పెద్దలు కొందరు మధ్యవర్తిత్వం చేసేవారు. కాని తండ్రీ కొడుకులు యిద్దరు చెబుతున్నదీ సబబుగానే కనుపించి, ఎవరి పక్షానా తీర్పుచెప్పలేకపోయేవాళ్లు.

తన వాదనవల్ల ఎంతకాలానికీ తండ్రి అభిప్రాయాలను మార్చలేకపోయేసరికి హిట్సుకి విసుగెత్తిపోయింది. 'ఈ ముస

కె. వి. జనార్దనం, నెల్లూరు




లాయన 'నేపట్టిన కుందేటికి మూడే కాళ్ళు' అనే పట్టు ఎంతకీ విడవకుండా వున్నాడే! కానివ్వు యిలా మరెంతకాలం సాగుతుందో నేనూ చూస్తాను" అని మనస్సులో అహంకారపడజొచ్చాడు.

మరికొద్దిరోజులకల్లా ఓమజోకు అవసానకాలం సమీపించటంవల్ల కొడుకును చేరబిలిచి—"నాయనా! గోభూమి విషయంలో నేనెంత పట్టుదల కలవాడినో నీకు తెలుసు. నీ మాటే నెగ్గించుకోదలిచితే, యిక నా అడ్డుకూడా లేదు కనుక, ఆ పని నీకు సులభమేననీ నాకు తెలుసు. కాని మూర్ఖత విడువు. ఆ భూమినిమాత్రం అంటనని నాకు మాటయివ్వు. అలా ఐతే నేను నిశ్చింతగా పోతా'నని కంట తడి బెట్టాడు.

ఇందుకు హిట్సూ "అలాగే నాయనా! మీమాట నెరవేర్చటంకంటే నాకు కావలసిన దేముంటుంది" అని నమ్మబలికేసరికి, ఆ వాగ్దానం చెవిని వేసుకొని ఓమజో నిశ్చింతగా చనిపోయాడు.

తండ్రి అడ్డం తొలగిపోయినందుకు హిట్సూ ఎంతగానో హాయి చెందాడు. అంతవరకు అతనిలో అణగారివున్న పట్టుదల ఒక్కపెట్టున యిప్పుడు పెల్లుబికింది. మర్నాడే గోభూమి సాగుచేయసాగాడు.

సుక్షేత్రమైన మాగాణి కావటంచేత కొద్ది కష్టంతోనే భూమిసాగు పూర్తిఅయి సేద్యానికి అనుకూలంగా తయారయింది. విత్తనాలు చల్లటం పూర్తి అయింది. సవ్యంగా చేను మొలకలెత్తింది. తర్వాత మరికొద్దికాలానికల్లా చేను పంటముఖానికి వచ్చింది. నవనవలాడే ఆ పంట చూచి హిట్సూ ఉప్పొంగిపోయాడు. ఇక నాలుగురోజులలో కోతలు ప్రారంభిస్తారనగా ఒక చిత్రం జరిగింది.

ఒకనాటి ఉదయం హిట్సూ తన పొలం చూచుకోవటానికని చేనుదగ్గిరికి వచ్చాడు. అతనలా నిలబడి చూస్తూ వుండగా—

తప్పు దిద్దుకొని ఓరన్నా
తండ్రి మాటలను వినుమన్నా
మూర్ఖత మానితె ఓరన్నా
ముప్పు తప్పురా నాయన్నా !

అనే పాట మానవభాషలో వినిపించింది.

హిట్సూ చుట్టూ కలయజూచాడు. కాని ఎక్కడా మనిషి జాడ కనబడందే! 'ఇదేదో చిత్రంగా వుందే' అనుకుంటూ తిరిగి చేను వంక చూడసాగాడు. మళ్లీ అదే పాట.

ఈసారి హిట్సూ ఆ పాట వచ్చినవైపుకి తిరిగేసరికి తను నిలబడిన చోటికి కొద్ది దూరంలోవున్న ఒక తుమ్మచెట్టు కొమ్మపైని పంచవన్నెలచిలుక ఒకటి కనుపించింది. "చిలక ఏమిటి, యిలా పాడటమేమిటి? పైగా నా తండ్రి సంగతీ నాసంగతీ దీనికెలా తెలిసింది?" అనుకుంటూ హిట్సూ— "సరేగాని చిలకమ్మా! అసలు నీవెవరవు? మా తండ్రీకొడుకుల మధ్య రహస్యాలు నీకెలా తెలుసు?" అన్నాడు.

"నాకు ఎలా తెలిస్తే నీకెందుకు నాయనా! నీ మంచి కోరే నేను చెబుతున్నాను. నమ్మించి మోసం చెయ్యాటమంత ఘోరమైన పని మరొకటి లేదు. అదే నీవు చేస్తున్నావు. నీ పొట్ట గడవటానికి



మిగతా రెండు ఎకరాలూ చాలవా? ఎందుకు అత్యాశకు పోతావు. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ఇంత కష్టపడి పంట పండించుకున్నానే అనే జిజ్ఞాస విడిచి, ఈ రోజే పంటతో సహా చేనుని నీ పశువులకు వదిలివెయ్యి" అని హితవు చెప్పింది ఆ పంచవన్నెల చిలుక.

అంతా విని, హిట్సూ ఒక్క వెకిలినవ్వు నవ్వి, "ఓస్! ఇంతాచేసి ఇదా నువ్వు నాకు చెప్పవచ్చింది? చాల్లే వెళ్లు" అన్నాడు. ఆ మరుక్షణం చిలుక రివ్వున ఎగిరిపోయింది.

మర్నాడు హిట్సూ మామూలుగా పొలానికి వచ్చాడు. కాని, ఏదీ పొలం?



క్రిందటి రోజున నిండు పంటతో నవనవలాడుతున్న చేను మాయమై బంజరు భూమి కనుపించింది. "ఇది నాభూమేనా!" అని కొంతసేపు తికమక పడ్డాడు. కాని తన భూమీ, భూమిపక్కనే ఆ సర్వేరాయీ చూచి అది తన భూమేనని నమ్మక తప్ప లేదు. హిట్సూకి కళ్లనీళ్లు తిరిగినై. అయినా మొండిపట్టు వదలలేదు. తిరిగి భూమిని సాగుచేయటం ప్రారంభించాడు.

మర్నాడు హిట్సూ వచ్చి చూచుకుంటే ఏముంది—దున్నిన భూమిలో మళ్లీ మొక్కా మొడుసూ తయారు! హిట్సూకు పూర్తిగా కోపం రేగింది. చిలక చేసినపనే అయివుంటుందనుకున్నాడు. ఇంతలో "నీ మూర్ఖతే దీనంతకూ కారణం" అనే మాటలు వినిపించినై.

హిట్సూ చెట్టువంక చూచాడు. చిలక కనుపించింది—

అప్పుడు చిలుక "కరువుకాటకాలు వచ్చినప్పుడు యిబ్బందిపడకుండా ఉండాలనేకదా ఈ ఎకరం భూమికూడా పంటకు ఉపయోగించుకో దలిచావు?" అన్నది.

"అవును" అన్నాడు హిట్సూ.

"సరే నేను ఒక ఉపాయం చెబుతాను, అలా చెయ్యి. ఇప్పుడు సాగులో ఉన్నటు పంటి ఆ రెండు ఎకరాలలో వచ్చే పంట మొత్తాన్ని నీవు నిలవచేసుకో. నీకు నిత్యం పంచభక్ష్య పరమాన్నాలు నేను అమరుస్తాను సరా?" అన్నది చిలుక.

"సరే, అలాగే చేస్తాను" అన్నాడు హిట్సూ.

"అయితే రేపు సరీగ్గా యిదే వేళకి నేను యిక్కడికి వస్తాను. అప్పుడు నన్ను నీతో పాటు యింటికి తీసుకువెళ్లు" అని చెప్పి, చిలుక రివ్వున ఎగిరిపోయింది.

ఆ మర్నాడు హిట్సూ చేనుదగ్గరకి వచ్చి నిలబడిన కొద్దిసేపటికల్లా చిలుక వచ్చింది.

అదివరకులా కాకుండా ఈసారి అది తన ముక్కుకి ఒక చిన్న మట్టిపాత్ర తగిలించుకువచ్చింది. చిలుకతోసహా హిట్సూ ఇల్లు చేరుకొని, "సరే, పంచభక్ష్య పరమాన్నాలేవో అమర్చు" అన్నాడు.

చిలుక పాత్రను హిట్సూ ముందు వుంచి, దానిచుట్టూ మూడుసార్లు తిరిగి, "నీకు ఏమేమి తినుబండారాలు కావాలో కోరుకుని పాత్రను బోర్లించు" అన్నది.

హిట్సూ అలాగే చేసేసరికి నిజంగానే కోరుకొన్న పంచభక్ష్య పరమాన్నాలు అమరిపోయినై. వాటిని ఆరగించి హిట్సూ ఎంతో తృప్తిపొందాడు. తర్వాత ఆ పాత్రని జాగ్రత్తగా దాచి చిలుకనిమాత్రం ఒక పంజరంలో పెట్టివేశాడు.

ఆరాత్రి హిట్సూ తిరిగి తన తిండికోసం ఆ పాత్ర తీసి, చిలుక చేసినట్టుగానే దాని చుట్టూ ముమ్మారు తిరిగి బోర్లించాడు. కాని, ఏమీ జరగలేదు. ఇది చూస్తూన్న చిలుక, "ఆమహిమ నాకుమాత్రమేఉన్నది. నీకు తిండి కావలిస్తే పాత్రతోపాటు నన్నూ బైటికితియ్యాలి" అని చెప్పింది.

ఇలా ఒక వారంరోజులు గడిచేసరికి హిట్సూకి ఒక దుర్బుద్ధి పుట్టింది. "దీనిని




బంధించి వుంచాను కనుక, యిక సేద్యం సాగించుకోవచ్చుకదా" అనుకున్నాడు.

ఈ చెడుతలంపు కలిగినప్పటినుంచీ యిల్లు కదిలి బయటికి వెళ్లని హిట్సూ, యిప్పుడు ప్రొద్దున వెళ్లి తిరిగి రాత్రికిగాని యింటికి రావటంలేదు.

ఇది చూచేసరికి చిలుకకు సందేహం కలిగి—"మహారాజులాగా కాలుకదపనక్కరలేకుండా యింట్లో కూచోవలసిన నీవు పగలల్లా ఎందుకు ఎక్కడెక్కడో తిరిగి వస్తున్నావ్?" అని అడుగుతుండేది.

చిలుక యిలా అడిగినప్పుడల్లా హిట్సూ "ఆ ఎంతసేపని వూరికే యింట్లో కూచు

నేది ? వూసుపోకకు అలా అలా పోయివస్తున్నాను" అని చెప్పి తప్పించుకొనేవాడు.

చిలుకని బంధించాను కదా అనే ధైర్యంతో హిట్సూ నిజంగానే తిరిగి గోభూమిలో సేద్యం ప్రారంభించాడు. క్రమంగా తిరిగి గోభూమి పంటభూమి అయి, పంట కోతకివచ్చేసిందికూడాను.

ఒకరోజు హిట్సూ మామూలుప్రకారం చిలకని పంజరంలోంచి బైటికితీసి పాత్ర కోసం లోపలికి వెళ్లి తిరిగి వచ్చి చూస్తే, చిలుక మాయమైంది. ఒక్క పరుగున హిట్సూ పొలానికి వచ్చి చూచుకున్నాడు. చిత్రమేమిటో! భూమిలోపంట మాయమై తిరిగి బంజరుగా తయారైవుంది. ఇది చూచి హిట్సూ కళ్లవెంట చింతనిప్పులు కక్కుతూ తుమ్మచెట్టువంక చూచాడు.

అప్పుడు ఆ చిలుక, "అబ్బాయీ! ఇంత ద్రోహం తలపెడతావని అనుకోలేదు. ఆశకు అంతం వుండాలి. నీకు ఎన్నివిధాలుగానో నచ్చజెప్పాను. మహరాజులా కాలం వెళ్లబుచ్చే ఏర్పాటు చేశాను. అయినా నీ మూర్ఖత తగ్గలేదు. కనుక తగిన ఫలం పొందావు. ఇంతకాలం ఇన్నివిధాల శ్రమపడి నీకు ఏవిధమైన కష్టమూ కలుగకుండా అన్ని సౌఖ్యాలూ అమర్చుతూవచ్చిన నేను పైవాడిని కాదు. నీ శ్రేయస్సు కోరే నీ తండ్రినే!" అని చెప్పి రెక్కలు రెపరెప కొట్టుకుంటూ హిట్సూ పాదాలదగ్గిర వాలి ప్రాణం విడిచింది.

కంటికి మింటికి ఏకధారగా ఏడ్చాడు హిట్సూ. తండ్రిపట్ల తను తలపెట్టిన ద్రోహానికి ఎంతో పశ్చాత్తాపం చెందాడు. మరునాడు ఆ గోభూమిలోనే చిలుకకు సమాధి కట్టించి, నాటినించీ హిట్సు గోభూమిజోలికి పోలేదు. అతని తదనంతరంకూడా దానిని పంటభూమిగా మార్చటానికి ఎవరూ ప్రయత్నించలేదు. ఇప్పటికీ అది గోభూమిగానే ఉండిపోయింది.






గణపవరంలో గణపతిశాస్త్రి ఒక సామాన్య గృహస్థు. 'ఇష్టకామేశ్వరి' వారి ఇలువేలుపు. ఆ ఊళ్లోనే ధనరాజనే ఒక సావుకారు కూడా ఉండేవాడు. అతడు పేరుకు ధనరాజేగాని చాలా పేదవాడు. అతడు శాస్త్రి వద్దకువెళ్లి తనసంగతి చెప్పుకుని, ఐశ్వర్యం వచ్చే మార్గమేదైనా సెలవివ్వమన్నాడు.

అందుకు శాస్త్రి, 'నేను సేవిస్తూన్న ఇష్టకామేశ్వరినే నువ్వుకూడా కొలు. ఆమెకు మనమీద దయ గలిగితే, మన కోరికలన్నీ సిద్ధిస్తాయి' అన్నాడు. ఆ మాట విని ధనరాజు 'నేను వేరే పూజ అంటూ మాయింట తతంగం పెట్టుకోడం ఎందుకు? రోజూ పూజవేళకి మీ యింటికే వచ్చి అమ్మవారికి దణ్ణం పెట్టి వెడుతూంటాను! అన్నాడు.

'అలాగే' అన్నాడు గణపతిశాస్త్రి.

కొంతకాలం అయేటప్పటికి వాళ్ల భక్తికి మెచ్చుకుని ఇష్టకామేశ్వరి ప్రత్యక్షమైంది. నాలుగు చేతుల్లోనూ నాలుగు కొబ్బరి కాయలు పట్టుకుని మరీ వచ్చింది ఆమె.

'మీకేంగావాలో కోరుకుని ఈ కొబ్బరి కాయలను కొట్టండి' అనిచెప్పి, ఆ టెంకాయలలో మూడు గణపతి శాస్త్రికీ, మిగిలిన ఒకటీ ధనరాజుకీ యిచ్చి, అంతర్ధానమైపోయింది. ఇందుకు శాస్త్రి సంతోషించాడు. ధనరాజు చిన్నబుచ్చుకొన్నాడు.

ధనరాజు భార్య కాసులమ్మతో జరిగినదంతా చెప్పి, 'చూశావా అమ్మవారు ఎంత పక్షపాతం చూపించిందో? ఆ బ్రాహ్మడికి మూడుయిచ్చి, నాకుఒకటే యిచ్చి ఊరుకుంది!' అన్నాడు.

కాసులమ్మ, 'పోనిద్దురూ; బాగుపడే గీతవుంటే ఈ ఒక్కకాయే చాలు. తొందరపడి ఏదో కోరేసుకుని కొట్టెయ్యకుండా, యేంకావాలో యిద్దరం కూడబలుక్కుని మరీ కొడదాం' అని సలహా చెప్పింది.

డి. పద్మావతీదేవి, హైదరాబాదు



వెంటనే ధనరాజుకి ఆలోచన తట్టింది. ఒక కాగితం తెచ్చి, బాగా ఆలోచించి, దానిమీద కోరికలన్నీ గుదిగుచ్చి ఒక్క వాక్యంలో ఇలా రాశాడు:

"తల్లీ, ఇష్టకామేశ్వరీ! ఏడంతస్థుల వెండిమేడపై నామునిమనుమని కుమారుని బంగారు గొలుసుల రత్నాల తొట్టెలో పరుండబెట్టి తన మేనిపైన నవరత్న మయములైన రకరకాల ఆభరణాలు ఒండొంటికి తగిలి ఘల్లు ఘల్లున మ్రోగుతూండగా ఊపే నా భార్యనూ, ప్రక్కను నిలబడి చూస్తో ఆనందించే నన్నూ, మా పుత్రపౌత్ర ప్రపౌత్రులూ, దౌహిత్రులూ, వారివారి భార్యలతో వచ్చి భయభక్తులతో సేవించేటట్లు అనుగ్రహించు" అని.

ఇది వినటంతోనే కాసులమ్మ 'సెబాష్, మంచి బాగా ఇమిడ్చారండీ! ఆలస్యం చెయ్యకండి. తూ. చా. తప్పకుండా కోరేసి, టెంకాయ కొట్టేసెయ్యండి' అంది.

భార్య చెప్పినట్లు ధనరాజు కొబ్బరి కాయ కొట్టేసరికి, వెంటనే వాళ్ళుంటూన్న ఆ పాతకొంప ఏడంతస్థుల వెండి మేడగా మారిపోయింది. అంతవరకూ ఉత్తిపసుపు బొందుతో ఉన్న కాసులమ్మ నగలతో ధగ

భార్యా భర్తలిద్దరూ తాపీగా కూర్చుని తామేం కోరుకోవాలో ఆలోచించుకున్నారు. ధనరాజుకి ఐశ్వర్యం కావాలనిపించింది. ఆ ఐశ్వర్యాన్ని అనుభవించటానికి కొడుకులూ, కూతుళ్లూ, మనుమలూ, ముని మనుమలూ కావాలంది కాసులమ్మ. వాళ్ల పెళ్లి పేరంటం చూసుకునేందుకు దీర్ఘాయుష్షు కావాలన్నాడు ధనరాజు. ముసిలి తనంలోకూడా తమ వాళ్లకు తమ మీద గౌరవం ఉండాలంది కాసులమ్మ.

ఇలా తమ కోరికలు చెప్పుకుంటూ పోగా 'ఒక్క కాయతో ఇన్ని కోరికలు ఎలా సిద్ధిస్తాయి!' అనిపించింది ఆ దంపతులకి.



ధగా మెరిసిపోతూ వుంది. అంతేనా? అంతవరకూ పిల్లలు లేని ఆమె నెలలు మోయసాగిందికూడాను. ఈ నిదర్శనాలు కనపడటంతోనే ధనరాజూ కాసులమ్మా తాము కోరుకొన్నదంతా క్రమంగా సిద్ధించి తీరుతుందని తెలుసుకుని సంతోషించారు.

ధనరాజు కాసులమ్మతో సంప్రతించి నట్లుగా ఈ విషయంలో గణపతిశాస్త్రి భార్య సోమమ్మతో సంప్రతించలేదు. సోమమ్మకు పుట్టినింటివారంటే ఎక్కువ అభిమానమనీ, వాళ్లకేదోవిధంగా ఉపకారం చెయ్యాలనే చూస్తోంటుందనీ అతని అనుమానం.

అందుకని, శాస్త్రి భార్యతో సంప్రదించకుండానే మనసులో వరం ఏదో కోరుకుని ఒక టెంకాయ కొట్టబోయాడు.

ప్రక్కనే ఉన్న సోమమ్మ అతడను కున్నంత పనీ చేసింది. 'ఏమండోయ్, రెండు కొబ్బరికాయలకు మీ యిష్టంవచ్చిన కోర్కెలు కోరుకోండి. మూడవదిమటుక్కు మావాళ్ల యిల్లూ మన యిల్లూ బంగారంతో నిండాలని కోరి, కొట్టండి' అందామె. అత్తవారంటే ఉన్నకోపంచేత వెటకారంగా శాస్త్రి, 'బంగారం కాదు, గాడిదగుడ్లతో నిండాలి!' అంటూ కాయకొట్టేశాడు.

ఏముంది? ఆ నోటిమాట నిజమై, శాస్త్రి యిల్లంతా గాడిదగుడ్లతో నిండిపోయింది! శాస్త్రికి చిరాకెత్తి, వాటిని వదిలిపించుకోవాలనే ఆదుర్దాతో "గుడ్లు మాయంకావాలి" అంటూ రెండో కాయ కొట్టేశాడు. ఈమాటు ఆ గాడిదగుడ్లే కాక దంపతుల కంటిగుడ్లు కూడా పోయాయి!

తలవని తలంపుగా తనకూ తన భార్యకూ ఇలా అంధత్వం కలిగినందుకు శాస్త్రి విచారిస్తూ ఆఖరి కాయతీసి, 'ఎప్పటికిమల్లే కళ్లు కనపడేటట్లుచేయ' మంటూ అది కూడా కొట్టేశాడు. దానితో వాళ్లకి మళ్లీ దృష్టీ, దృష్టితోపాటు బుద్ధీ వచ్చింది.



# సత్యసంధుడు

పర్లాకిమిడిలో మల్లయ్యా అనే ఒక పేదవాడుండేవాడు. వాడు బ్రహ్మచారి. పెళ్లీ పెటాకులూ లేదు. వాడి వృత్తి ఏమిటో, జీవితం ఎలా గడుపుతాడో ఒక్కరికీ తెలీదు. సంసారతాపత్రయం లేని మల్లయ్యాకు డబ్బు అవసరం మాత్రం ఏముంటుందీ అని మనం అనుకుంటాం. కాని, మల్లయ్యా వూళ్లో ఎవరిదగ్గరో ఒకరి దగ్గర చేబదులు చేయని రోజు లేదు. వాడు ఇలా బదులు చేసి, తీసుకున్న సొమ్ముతో ఏమి చేస్తాడూ? అనే ప్రశ్న కూడా ఎప్పుడూ ఎవరికీ తట్టలేదు.

మల్లయ్యా మొదట్లో ఆవూరికి వచ్చినప్పుడు ఓంప్రథమంగా సుబ్బారాయుడు గారిదగ్గర ఒక్క బేడ బదులుచ్చుకున్నాడు. "సుబ్బన్నబాబూ! ఎల్లుండి సాయంత్రం మళ్లా యిచ్చేస్తానుసుమా ఈ రెండణాలున్నూ" అని మాట యిచ్చాడు. ఆ మాటప్రకారమే సరిగ్గా మూడవరోజున సాయంకాలం మూడు గంటలకల్లా రెండణాలూ తెచ్చి ఇచ్చేశాడు. సుబ్బారాయుడు ముందుగా మల్లయ్యాను నమ్మలేదు. ఏమీ అంటే మల్లయ్యా ఎవరో అతనికి ఎరుకలేదు. కేవలమూ కొత్తవాడే అయినప్పటికీ, 'నోరు తెరిచి అడిగాడే లేదనటం ఎట్లా? ఇంతా చేసి బేడ డబ్బులే కదా, చూదాం ఏం పోయింది ఇంతలో' అని ఆలోచించి బదులిచ్చాడు. ఎప్పుడైతే మల్లయ్యా మాట తప్పకుండా చెప్పిన గడువుకి సొమ్ముతెచ్చి ఇచ్చాడో, అప్పుడు అతనిమీద సుబ్బరాయుడుకి మంచి నమ్మిక కుదిరింది.

ఆ తరువాత, మళ్లీ అడపాతడపా మల్లయ్యా సుబ్బారాయుడిదగ్గరకి రావటం, రూపాయీ అర్ధా తీసుకుంటూవుండటం, ప్రతీసారీకూడా గడువు తప్పకుండా బాకీ

జి. మంగన్న—పర్లాకిమిడి




తీర్చివేస్తూవుండటం జరుగుతూనేవచ్చింది. సుబ్బారాయుడితో ఇలా వ్యవహారం సాగించిన కొద్దిరోజులకల్లా వూళ్ళో ఒక ఒక వదంతి వ్యాపించింది.—'ఫలానా మల్లయ్య చాలా కచ్చితమైన మనిషి. ఇటువంటి సత్యసంధుణ్ణి ఈ కలికాలంలో చూడబోము' అని. మల్లయ్యనుగురించి ఈ వదంతి ఎప్పుడైతే అల్లుకొన్నదో, ఆ క్షణం నించీ వానికి పరపతి పుట్టటానికి ప్రారంభమైంది. మల్లయ్య అడగటమే తడవుగా ఎవరైనాసరే అమితసంతోషంతో వాడికి బదులిచ్చేవాళ్లు.

ఇలావుండగా ఒకరోజున మల్లయ్య పర్లాకిమిడిలోకల్లా పచ్చిసావుకారు అని అనిపించుకొంటూవున్న గోపయ్యశెట్టివద్దకు వెళ్లి "గోపయమామా! తలవని తలంపుగా పెళ్లికి వెళ్లవలసిన ప్రయాణం ఒకటి తగిలింది. వరుడి తరఫువారు మనకు చాలా కావలసినవాళ్లు. అందుకని కొత్తరకం బహుమతులేవైనా కొని తీసుకుపోవాలె. ఒక్క నూరురూపాయలుంటే ఇవ్వు. నేను ఐదురోజులకల్లా తిరిగి వచ్చేస్తాను. అనగా ఇవాళ బుధవారం కదా. రేపు తెల్లవారగట్టే సుముహూర్తం. రేపటినించి ప్రారంభించి గురు, శుక్ర, శని, ఆది, సోమవారంతో కార్యం అయిపోతుంది. మళ్లీ మంగళవారంనాడు ఉదయం ఏడున్నరకల్లా వచ్చి దిగుతానన్నమాట. నేను రావడమేమిటి, బాకీ ఇచ్చివేయడమేమిటి? అసలు ఇచ్చేసి మరీ ఇంటికి వెళతాను," అన్నాడు.

గోపయ్యశెట్టి అసలే అనుమానం మనిషి. లక్ష ప్రశ్నలు వేసి, తృప్తిపడితే కాని పెట్టెలోనించి పైసా కదపడు. ఇప్పుడు మల్లయ్యనుగురించి మనసులో నిదానంగా యోచింపసాగాడు. 'ఈ మల్లయ్య చాలా చిత్రమైన వ్యక్తిలాగా కనబడుతున్నాడే. వీడికి వుద్యోగం సద్యోగం లేదు. వ్యాపకం



ఏమిటా అంటే అదీ కనిపించదు. ఊహుం పూరంట పెత్తనాలు చేయటం, చేబదుళ్ల పేరుచెప్పి తలలు మారుస్తూవుండటమే పని. రేపటిరోజున స్నేహితులింట పెళ్లికి వెళ్లాలంటున్నాడు. బహుమతులు కొని పట్టుకవెళ్తాడట. అనగా నన్ను బదు లడుగుతున్న నూరురూపాయలూ కర్చు పెడతాడన్నమాటే కద. పెళ్లి అయిన వెంటనే, క్షణమైనా అక్కడ నిలవ కుండా తిరిగివచ్చేస్తాడట. వస్తూనే నా సొమ్ము నాకిచ్చివేసి మరీ యిల్లు చేరు కుంటాడట. ఇది మరీ గమత్తుగా వుందే. ఒకమూల అక్కడ కర్చుకని బదులుచేసి సొమ్ము పట్టుకువెళుతూ, తిరుగా ఆ తక్షణమే ఎలా పట్టుకువచ్చి నాకిచ్చివేయ గలడు? ఏమాత్రమూ వ్యవధి లేదే! అంత నిమిషాలలోనే ఈ మల్లయ్యకు సొమ్ము సద్దుబాటు ఎలా అవుతుంది? అపాటి సామ ర్థ్యమే ఉన్నవాడు అసలు బదులంటూ ఎందుకు చేయవలసివస్తుంది'—ఈ విధంగా తనలో తను తర్కించుకొన్నాడు.

చివరకు, ఏమనుకున్నాడో యేమో, లోపలినుండి తెచ్చి 'ఇదుగోనోయి మల్లయ్యా!' అంటూ పది పదిరూపాయల కాగితాలు లెక్కపెట్టి యిచ్చాడు.

తన పని ఇలా సానుకూలమైనందుకు మల్లయ్య చాలా సంతోషించాడు. అందు లోనూ ముఖ్యంగా గోపయ్యవంటి కర్కోట కుడు తనకు వశమైనాడంటే అది తన జీవితంలోనే ఒక గొప్ప సఫలత అన్నట్లు ఎంచుకొన్నాడు. మల్లయ్య పెళ్లికే వెళ్లాడో మరెక్కడికి వెళ్లాడో ఆ ప్రసక్తి మన కెందుకు?—మళ్లీ మంగళవారంనాటి ఉదయం సరిగ్గా ఏడున్నర గంటలకల్లా టంచనుగా గోపయ్యవద్దకు వచ్చి వాలాడు.

గోపయ్య నిజంగా ఆశ్చర్యపోయాడు. మల్లయ్య నిజాయితీ చూసి. "ఏం మల్ల




య్యా!— పెళ్లికి వెళ్లివచ్చావా? కార్యం బాగా జరిగిందా? ఏమేమి బహుమతులు తీసుకుని వెళ్లావు పెళ్లికొడుక్కి?" అంటూ కుతూహలంతో క్షేమవార్తలు కనుక్కొన్నాడు.

ఇందుకు మల్లయ్య, తను కొన్న కొత్త రకపు బహుమతులను వర్ణించి, 'పెళ్లికేమి అతి వైభవంగా జరిగిం'దని బదులు చెబుతూ, "ఇదుగో మామా! మాట తీసేయకుండా సమయానికి సర్దుబాటు చేశావు. అదే పదివేలు..." అంటూ ఒక నూరు రూపాయల విలువకు నోట్లు యిచ్చాడు.

చూడగా అవి పది పదిరూపాయల కాగితాలు. గోపయ్యకు వెంటనే మనసులో ఏదో ఆలోచన మెదిలింది. 'ఇప్పుడే వస్తానుండు మల్లయ్యా!' అంటూ లోపలికి పోయి, ఒక నోటుబుక్కు తెచ్చి, మల్లయ్యను చూడమన్నాడు. మల్లయ్య అది చూచి గతుక్కుమన్నాడు.

ఆరోజునే గోపయ్య ఊళ్లో అందరినీ సమావేశపరిచి, "చూచారా అబ్బాయిలూ, మన సత్యసంధుడు మల్లయ్య ఎంత చిత్రమైన నాటకం ఆడుతూవున్నాడో! మీరందరూ మెచ్చుకొంటూవున్న అతని సత్యసంధత ఏమిటో కనిపెట్టాలని అదును కోసం చూస్తూవుంటిని. మొన్న నీమధ్యాని 'ఊరికి వెళ్ళాలి, ఒక నూరురూపాయలు కావా'లంటూ చేబదులుకోసం వచ్చాడు. వెళ్లేది పెళ్లికి, బహుమతులు కొనిపట్టుకు వెళ్లాలిఅనికూడా చెప్పాడు ఎంతో ఆత్రంతో. సరే, ఇదెంతవరకు నిజమో చూదామని పది పదిరూపాయల నోట్లు ఇస్తూ, వాటి నంబర్లు ఆనవాలుగా ఈ పుస్తకంలో వ్రాసి పెట్టుకున్నాను. మన సత్యసంధుడు మల్లయ్య వాగ్దానంప్రకారం ఈ రోజున అనగా మంగళవారం ఉదయం ఏడున్నర గంటలకల్లా నా నూరురూపాయలూ నాకు పువ్వులలో పెట్టి టంచనుగా తెచ్చియిచ్చే

శాడు. అవి పది పదిరూపాయల కాగితాలు. చూతునుకదా, వాటి నంబర్లూ నేను పుస్తకంలో వ్రాసిపెట్టుకున్న నంబర్లూ ఒక్కటే! అంటే, వాడు ఐదు రోజులూ అయినతరువాత నా నోట్లే నాకు తిరుగా పట్టుకవచ్చి ఇచ్చివేశాడన్నమాట. పోతే— ఇన్నాళ్లనించీ మీ అందరివద్దా తీస్తున్న చేబదుళ్ల సంగతికూడా ఇదే ఐవుంటుంది. చెప్పిన గడువుకి తెచ్చి ఇచ్చివేస్తున్నాడన్న సంతోషంలో మీరు వాడిని పొగడుతున్నారే కాని, వాడు చేస్తున్న పని గమనించలేక పోయారన్నమాట. మరొక ముఖ్యవిషయం ఏమిటంటే—వాడు మనవూళ్ళో సుబ్బారాయుడుగారివద్ద ప్రారంభించిన బేడ డబ్బుల బదులుతో తనొక సత్యసంధుడనని లోకులను నమ్మించి క్రమంగా ఇప్పటికి ఆ పరపతిని చాకచక్యంతో నూరురూపాయలవరకు పెంచుకొని రాగలిగాడు. ఇలా మొత్తం బాగా పెంచి, చివరకు లోకుల్ని మాపివేసి ఉడాయించవచ్చుకదా అని వ్యూహం పన్నివుంటాడు. చూడండి అమాయికంగా వాణ్ణి నమ్మి అడిగినంతా బదులిస్తూనేవున్నారు అందరున్నూ. నేనే ఈనాడు వాడిని ఇలా పరీక్షకు పెట్టకపోతే రంగు బయటపడేదే కాదు. కనుక జరిగిందేదో జరిగింది. ముందైనా జాగ్రత్తగా వుండండి!" అని హెచ్చరించాడు.

ఈ కథ విన్నతరువాత ప్రజలందరూ 'మల్లయ్య సత్యసంధుడు కాడు. మోసాల మల్లయ్య!! అయ్యో, ఎంత అవివేకంలో పడిపోయాము. అయిందేదో కానీ, ఇక ముందు పైసా ఐనా వాడికి అప్పు పెట్టకూడదు' అని తీర్మానించుకున్నారు. మరునాడు మళ్లీ వచ్చి కనపడుతాడుకదా, ఈసారి వాడికి బుద్ధి చెబుదాం అని ఊరి వాళ్లందరూ సిద్ధంగా కూర్చున్నారు. కాని, నాటికీ నేటికీ మల్లయ్య మళ్లీ పర్లాకిమిడి ప్రజల కంటపడితే కద!



# కప్పలు "బెకబెక" లాడుతై



## ఎందుకో తెలుసా?

చూడటానికైతే అనాకారిగా వున్నాడు కాని, పూర్వకాలమందు కప్పబావ కంఠ స్వరం చాలా శ్రావ్యంగా వుండేది.

ఒకరోజున కప్పబావ ఆనందంగా పాడుకుంటూ పోతూవుండగా ఎలకయ్యా ఎదురు వచ్చి, "కప్పబావా, కప్పబావా !!—ఎక్కడికిలా బయల్దేరావు ?" అని అడిగాడు.

"ఎంతవరకూ యేమిటి? కడుపు నింపుకోటానికి పోతున్నాను" అని జవాబు చెప్పాడు కప్పబావ.

'సరే నేనూ నీకు తోడు వస్తానుండ' మంటూ కప్పబావ వెంట ఎలకయ్యా బయల్దేరాడు. ఇద్దరూ కలిసి వెళుతుండగా ఒక యింటిలోనించి ఘుమ ఘుమ కమ్మటి వాసన వాళ్ల ముక్కులకు తగిలింది. 'భేష్, మంచి మంచి పదార్థాలు తయారవుతున్నాయి. అక్కడికి పోదాం రావయ్యా ఎలకయ్యా !' అని పిలిచాడు కప్పబావ.

అందుకు ఎలకయ్యా "అంత తొందరైతే ఎలాగ? ఆనూ పానూ తెలియకుండా పరాయియింట్లో ఆమట్టున దూరటమేనా ?" అన్నాడు ఎలకయ్యా.

అప్పుడు కప్పబావ "చూడు ఎలకయ్యా! నువు ఇంత పిరికివాడని అనుకోలేదు. 'ధైర్యే సాహసే లక్ష్మి' అన్నారు పెద్దలు. కాబట్టి చొరవ చేసుకోవాలి. ఏమైనా సరే, నేను వెళతాను. వాటం చూసి, కడుపాత్రం తీర్చుకుంటాను. నువ్వు వస్తే రా, లేకుంటే పో, తరువాత నీ యిష్టం..." అన్నాడు కప్పబావ.

కష్టమో నిష్ఠురమో, ఇంతవరకు కలిసి వచ్చాముకదా అని ఎలకయ్యా కప్పబావ వెంట నడిచాడు. ఇంటి గదులన్నీ గాలించారు వాళ్లు, 'ఆ పరిమళం ఎక్కడినించి వస్తున్నదీ!' అనుకొంటూ, చివరకు పదార్థాలు తయారవుతున్న వంటగది

ఈ నెల బహుమతి పొందిన కథ — పి. సుశీల, బొంబాయి

బహుమతిగా ఈమెకు మే '51 నుంచి ఒక సంవత్సరంవరకు 'చందమామ' పంపబడుతున్నది.

కనుపించింది. అక్కడ మరెవ్వరూ లేరు. బాగుందనుకున్నాడు కప్పబావ. 'ఏ క్షణానికి ఎవళ్లు వస్తారో!' అని జాగ్రత్త చెప్పబోయాడు ఎలకయ్య.

'పోవోయ్, నీ సలహా ఎవడికి కావాలి. నాకు పిరికిమందు పోయబోకు' అంటూ నిరాకరించాడు కప్పబావ. పైగా 'అయ్యా, ఎలకయ్యా!—నీవు చాలా భయస్థుడివి. కనుక గుమ్మం దగ్గర కాపలావుండి, ఎవరన్నా వస్తున్న అలికిడి ఐతే నాకు సంజ్ఞ చెయ్యి. ఈలోగా ఈ పదార్థాల మంచి చెడ్డలు చవిచూచి నీకు చెబుతాను. తరువాత నువు ఆరగింతువుగాని' అన్నాడు. 'సరే' నన్నాడు ఎలకయ్య.

కప్పబావ మెల్లగా ఒక గిన్నెమీది పళ్లెం మూత ఒత్తిగించాడు. అక్కడనే ఒక గరిటె కనపడగా, గిన్నెలో ఉడుకుతూ ఉడుకుతూ వున్న ముక్క ఆశకొద్దీ, నోట్లో వేసుకున్నాడు కప్పబావ. అంతలో వంటవాడు వచ్చాడు.

కప్పబావకు ఠిక్కచచ్చినట్టయింది. పొగలు వస్తున్న ఆ ముక్కను మింగలేడు, కక్కలేడు, గొంతుక కాలిపోతున్నది. ఏం చెయ్యటం? బాధపడుతూనే గప్‌చిప్‌గా ఒకమూల నక్కాడు. అదృష్టవశాత్తూ, వంటవాడు ఒకసారి పదార్థాలన్నీ కలియబెట్టి, మూతలు చూసుకుని వెళ్లిపోయాడు. 'గండం తప్పింది. బతుకు జీవుడా' అనుకుని కప్పబావ బయటపడ్డాడు. 'ఎలకయ్యా! ఎలకయ్యా!' అంటూ నేస్తాన్ని పిలవబోయాడు. కంఠస్వరం మామూలుగా లేదు. ఇంకెక్కడి ఎలకయ్య! కప్పబావ మతం సమ్మతంలేని ఎలకయ్య ఎప్పుడో ఉడాయించేశాడు. కప్పబావ ఇదేమిటా ఇలా జరిగిందని చెప్పి, గొంతు సవరించుకొని పాడబోయాడు. పాట పాడటం చేతకాలేదు సరికదా బెకబెకా బెకబెకామని అనటం తప్ప మరేమీ చెయ్యలేకపోయాడు.



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

అడ్డము :

1. చికిత్స
3. వింటిబ్రతాడు
4. భస్మము
6. పిసినారి
8. ఒక పుణ్యక్షేత్రం
10. ఒక పర్వతం
11. ఋషి
13. జడ
14. చందమామ
16. సర్పము
17. రాముని కొడుకు




నిలువు :

1. శత్రువు
2. పూర్వము
3. బొడ్డు
5. జుట్టుముడి
6. ప్రపంచము
7. బృహస్పతి
9. గారడి
12. రాత్రి
13. చారుడు
15. రాయి
16. దేశము

## యుక్తి లెక్క

నాలుగు అంకెల సంఖ్య. ఈ సంఖ్యని

| | | | |
|---|---|---|---|
| 2 | చేత భాగిస్తే | 1 | మిగులుతుంది |
| 3 | ,, | 2 | ,, |
| 4 | ,, | 3 | ,, |
| 5 | ,, | 4 | ,, |
| 6 | ,, | 5 | ,, |
| 7 | ,, | 6 | ,, |
| 8 | ,, | 7 | ,, |
| 9 | ,, | 8 | ,, |
| 10 | ,, | 9 | ,, |

ఈ చిత్రమైన సంఖ్య ఏదో కనుక్కోండి.

## వినోదచదరం

ఈ చదరాన్ని, దిగువ యిచ్చిన ఆధారముల సహాయంతో పూర్తిచెయ్యాలి. ప్రతి మాటలో చివరవచ్చే అక్షరాలన్ని ఒకేలా రావాలి.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | | ద | | |
| 2. | | శా | | |
| 3. | | వ | | |
| 4. | | తా | | |
| 5. | | ర | | |
| 6. | | ము | | |
| 7. | | లు | | |

ఆధారములు :

1. దుఃఖము, 2. దయ్యము, 3. మదము 4. జెండా, 5. విషము, 6. కలువ, 7. పాపము

జవాబులకి 54-వ పేజీ చూడండి.

# అట్టమీది బొమ్మ



ఊరివెలుపలి గుడినుండి రుక్మిణి తిరుగ వచ్చేటప్పుడు శ్రీకృష్ణుడు బలాత్కారంగా తన చెల్లెలిని ఎత్తుకపోయి రాక్షసవిధానంగా పెళ్లాడబోతున్నట్టు రుక్మికి తెలియవచ్చింది. ఈ వార్తకు అతను మండిపడ్డాడు. 'కృష్ణుణ్ణి చంపి, చెల్లిని విడిపించిగాని కుండినకు మరలిరాను' అని ప్రతిజ్ఞ చేశాడు. ఆవెంటనే ఒక అక్షౌహిణి సైన్యం సిద్ధం చేశాడు. సారథితో 'మన రథాన్ని దుర్బుద్ధి ఐన ఆ గోపాలుడివద్దకు పోనీయవోయ్. నాలుగు బాణపు దెబ్బలతో వాడి గర్వం అణచి పారవేస్తాను' అన్నాడు. రుక్మి కృష్ణులమధ్యని పౌరుషం రేగింది. యుద్ధం జరిగింది. కృష్ణుడు రుక్మిని సంహరించబోతూవుండగా రుక్మిణి ఆయన పాదాలు పట్టుకొని 'దేవదేవా! జగత్పతీ!! ఈ ఒక్కసారికీ నా అన్నను క్షమించి వదిలివెయ్యి' అంటూ దీనంగా ప్రార్థించింది. అప్పుడు శ్రీకృష్ణుడు రుక్మిని కట్టివేసి, నేలకు పడకొట్టి, కేశాలూ, మీసాలూ కత్తిరించి, అతనిని కురూపిగా తయారుచేశాడు. అంతట బలరాముడు వచ్చి, "తమ్ముడూ! యేమిటి యిటువంటి పని చేశావు? అతడెటువంటివాడైనా మన రుక్మిణికి అన్నేకదా! అయిందేదో అయింది. పురుషుడికి మీసాలు తీసివేయుటంకంటె మించిన శిరచ్ఛేదం లేదు. కనుక, ఇంతటితో వానిని వదిలేయవలిసింది' అంటూ మందలించాడు. అందుకు కృష్ణుడు "అన్నయ్యా!—నేను చేసింది ఏమీ లేదు. వాడి కర్మే వాడిని ఇలా చేసింది' అని చెబుతూ, జీవిత పరమార్థం వెల్లడించాడు. ఇప్పుడు—ఈవిధంగా పరాభవం పొందిన రుక్మి ప్రాణాలతో బయటకు వచ్చేశాడు. మరి, కృష్ణుణ్ణి చంపి, చెల్లెలిని విడిపించిగాని కుండినకు మరలనని శపథం చేసివున్నాడుగా! అందుకని, అక్కడికి పోవటానికి మొహం చెల్లక, భోజకటం అనే వూరు చేరుకుని, తలదాచుకొనబోయాడు.

# రోకంటి పాటలు



సేకరణ :

అడుసుమల్లి సరస్వతీదేవి, ముదినేపల్లి



ఉత్తముడి పేరేమి - వూరుపేరేమి ?
సత్యపురుషులగన్న - సాధ్వి పేరేమి ?
ఉత్తముడు దశరథుడు - వూరు అయోధ్య
సత్యపురుషులగన్న సాధ్వి కౌసల్య ॥

* * *

రాగుల్లు నల్లన్న - పిండి తెల్లన్న
అంబలి పుల్లన్న - కడుపు చల్లన్న
మామల్ల కూతుళ్లు - మంచి ఎర్రన్న
మాటల్లు తియ్యన్న - మనసు నల్లన్న ॥

* * *

తోడికోడలు పెద్ద - తులిశమ్మ పెద్ద
అందరికి తాపెద్ద - అలివేలు మంగ
పడతికందరికన్న - భర్తయే పెద్ద
అందరికి తాపెద్ద - ఆదిశేషుండు ॥

* * *

గుర్రమ్ము సకిలించె - కూటివేళాయె
ఏమిరా బంటోడ ! అన్నేల రాడు ?
సూరీడు జారేడు - చుక్కల్లు పొడిచే
ఇంకనూ రాడాయె - ఏమి చిత్రంబు ?

# అంపకాల పాట



సేకరణ :

గులపల గోపాలు, మదరాసు



ఎందుకే నా తల్లి ఏడ్చుచున్నావు ?
ఇన్నాళ్లుగా నీవు మనయింటనున్నా
ఇకమీద అత్తవారిల్లె శాశ్వతము.

* * *

భర్తదగ్గర నీవు భక్తితో మెలగు
భర్త మెచ్చిన నిన్ను పరమేశు మెచ్చు
అత్తదగ్గర నీవు అవకతవకలుగ
నడుచుకోబోకమ్మ చెడుపేరువచ్చు.

* * *

క్షితిపైన సీతమ్మ పతివ్రతాదేవి
పసుపుకుంకుమ నీకు పెట్టినాసొమ్ము
భర్తతోడిదె నీకు దేవలోకమ్ము.

* * *

వర్షాలు వచ్చితే వరదలూ వచ్చు
పరమేశుకన్న నీ భర్తయే హెచ్చు
సావిత్రి తనభర్త సత్యవంతుడినీ
బ్రతికించుకొనియెనూ పతిభక్తిచేత.




క్రిందటినెల సర్కారు మా ఆఫీసుకి వచ్చినప్పుడు ఒక చిత్రమైన తాడు ట్రిక్కు చేసి చూపారని చెప్పాము. జ్ఞాపకముందా? అలాంటిదే ఈ ట్రిక్కు కూడాను. ఇది చూచే వారికి ఎంతో కష్టమైనదిగా కనుపిస్తుంది. అయినా, చెయ్యటం చాల తేలిక.

ప్రేక్షకులకు ఎదురుగా నిలబడి, నీ చేతులు రెండూ చాచి, అరచేతులు రెంటినీ జోడించు. ప్రేక్షకులలో ఎవరినన్నా ఒకరిని ఒక చేతిరుమాలుతో నీ చేతులను మణికట్టు దగ్గిర కట్టివెయ్యమను. ఎలాటి సందేహానికీ అవకాశం లేకుండా రుమాలు ముడివేసిన చోట సిరా గుర్తు పెట్టుకోమను. యింకా కావాలంటే సీలు వేసుకోమను. తర్వాత ఒక తాడు తెచ్చి, నీ చేతులకు కట్టిన రుమాలు వెనకగా రెండు చేతుల మధ్యనించి ఆ తాడును దూర్చమను. ఇలా తాడును దూర్చి, కొసలు తనవైపు తీసుకుని రెండు కొసలూ కలిపి ముడివేసుకోమను. ఈ ముడికికూడా సిరా గుర్తుగానీ సీలుగానీ వేసుకోవచ్చునను. చేరుమాలు కట్టడం, తాడు దూర్చటం, ప్రేక్షకుడు దాన్ని పట్టుకోవటం ఎలా వుండాలో ప్రక్కపేజీలోని మొదటి బొమ్మలో చూడు.

ప్రేక్షకుడు యిప్పుడు తాడును ఎంతగా పట్టి లాగినా రాదుకదా? మరొక రుమాలుతో నీ చేతులను మూసివెయ్యమను. ఇలా మూసివేసిన వెంటనే, చమత్కారమైన మాటలతో చిన్న ఉపన్యాసం ప్రారంభించు. 'చూడండీ! ఇప్పుడు తాడు లాగితే రావటం లేదుకదా? కాని, నేను వన్, టూ, త్రీ అంటాను. మీలో ఎవరైనా సరే వచ్చి నేను 'త్రీ' అనగానే తాడును లాగండి" అని చెప్పు. నీవు చెప్పినట్టుగా ప్రేక్షకులలో

ఒకరు వచ్చి తాడును లాగుతారు. చూపరులకు ఆశ్చర్యం గొలిపేటట్టుగా అంతకు ముందు ఎంత గట్టిగా లాగినా రాని తాడు, యిప్పుడు యిట్టే వచ్చేస్తుంది. అంతేకాదు. చేతిరుమాలు ముడిదగ్గిరా తాడు ముడి దగ్గిరా వేసిన గుర్తులు చెక్కుచెదరకుండా వేసినవి వేసినట్టే వుంటై. 'ఇది ఎలా సాధ్యం?' అని మీ ప్రశ్న. కిటుకు యిది:

చేతిరుమాలుతో చేతులను కప్పివెయ్యగానే నువ్వు ప్రేక్షకులను నీ మాటలతో ఆకర్షించి, రుమాలు అడుగున నీ చేతులతో ఒక చిన్న గమ్మత్తు చెయ్యాలి. రుమాలుకు వెనకగా వచ్చిన తాడును బొటనవ్రేలితో మెల్లిగా ముందుకు లాగాలి. అప్పుడు ఒక మెలిక ఏర్పడుతుంది. ఇది ఎలా వుండాలో రెండో బొమ్మలో చూడు. ఇలా లాగగా ఏర్పడిన మెలికలోంచి నీ చేతిని దూర్చు. ఇది ఎలాగో మూడో బొమ్మలో చూడు. అంతే. ఇప్పుడు ప్రేక్షకుడు వచ్చి తాడును లాగినట్టయితే ఏమాత్రం ఆటంకం లేకుండా యిట్టే వచ్చేస్తుంది.

ఈ ట్రిక్కు నీవు పట్టుబడకుండా చెయ్యాలీ అంటే, మాటలవల్ల ప్రేక్షకులని ఆకర్షించటం చాల ముఖ్యం. ఎందుచేతనంటే నీ ఉపన్యాసాన్ని ప్రేక్షకులు ఎంతో శ్రద్ధగా వింటూ వుండిపోయి చేతిరుమాలు అడుగున నీవు చేసే గమ్మత్తు గ్రహించలేరు.







పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలుసుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదాహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరు రాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ప్రొఫెసరుగారి అడ్రసు యిది

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్,

12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,

కలకత్తా - 19.

పజిలుకి జవాబు :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ★ | ★ | 1 వై | ద్య | 2 ము | ★ | ★ |
| ★ | 3 నా | రి | ★ | 4 సు | 5 సి | ★ |
| 6 లో | భి | ★ | 7 గు | ★ | 8 గ | 9 య |
| క | ★ | 10 మే | రు | వు | ★ | క్షి |
| 11 ము | 12 ని | ★ | డు | ★ | 13 వే | ణి |
| ★ | 14 శ | 15 శి | ★ | 16 నా | గు | ★ |
| ★ | ★ | 17 ల | వు | డు | ★ | ★ |

49-వ పేజీలోని యుక్తిలెక్కకి జవాబు :

2519

వినోదచదరానికి జవాబు :

| | | | | |
|---|---|---|---|---|
| 1 | వ | ద | న | ము |
| 2 | పి | శా | చ | ము |
| 3 | కా | వ | ర | ము |
| 4 | ప | తా | క | ము |
| 5 | గ | ర | ళ | ము |
| 6 | కు | ము | ద | ము |
| 7 | క | లు | ష | ము |

# "ఎందుకో తెలుసా?"

★

"కప్పలు 'బెకబెక' లాడుతై" ఎందుకో తెలుసా ?" అన్నదానినిగురించి మాకు వచ్చిన కథలోకెల్లా ఉత్తమంగా వున్న కథ ఈ సంచికలో ప్రచురించాం. ఈకథ పంపినది పి. సుశీల. బొంబాయి బహుమతిగా ఈమెకు మే '51 నుంచి ఒక సంవత్సరంవరకు 'చందమామ' పంపబడుతున్నది.

వచ్చే నెల (జూన్ '51) కు "బుల్ బుల్ పిట్ట రాత్రంతా మేలుకుని పాడుతూవుంటుంది," ఎందుకోతెలుసా? అనే విషయాన్ని గురించి మీరు తెలుసుకుని ఒక చక్కటి కథ వ్రాసి పంపండి. మీరు పంపే కథలు రెండు పేజీలకు మించకుండా వుండి మే 15-వ తేదీలోగా మాకు చేరేట్లు ఈ క్రింది అడ్రసుకు పంపండి.

★

"కథల తాతయ్య"

**చందమామ ఆఫీసు**

పోస్టుబాక్సు 1686, మదరాసు-1




ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (జూన్)
చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.




డిస్ట్రిబ్యూటర్లు :

ఆంధ్ర : గోకుల్ కృష్ణా ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్ :: విజయవాడ

సీడెడ్, చిత్తూరు : జీవన్ ఫిలింస్, గుంతకల్లు | నైజాము : జగత్ పిక్చర్స్, సికంద్రాబాదు

మైసూరు : అమృత్ పిక్చర్స్, బెంగుళూరు | బొంబాయి : శ్రీనివాస్ పిక్చర్స్, గదగ్

ఇతర వివరాలకు : విజయలక్ష్మి ప్రొడక్షన్సు, మదరాసు - 17

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI, at the B. N. K. Press, Madras - 1

CHANDAMAMA (TELUGU) MAY 1951 REGD. NO. M. 4854




'పుస్తకం చించి, పైగా అలా చూస్తావేం...!'